ప్రాంకీలు భయపెట్టేవని
మీరు అనుకుంటే
పెద్ద పెద్ద ప్రాంకీస్‌కోసం
తయారవ్వండి.

ట్విన్ ప్యాక్, పెద్ద ప్రాంక్!




ఈ ఆఫర్ రస్నా సాఫ్ట్ డ్రింక్ కాంసన్‌ట్రేట్ ట్విన్ ప్యాక్ మీద వర్తిస్తుంది. స్టాకులున్నంత వరకే ఈ ఆఫర్ వర్తిస్తుంది.

**For more Pranky fun visit: www.gogokid.com**

Mudra:RASNA:368/CHN/Tel.

# చందమామ

సంపుటి 104 మే 2001 సంచిక 5



ఈ సంచికలో...



ఈ నెల విశేషాలు

కౌశికుడి తపస్సు! (బేతాళ కథలు)





భారత సంస్కృతి - చరిత్ర

అత్తగారి జబ్బు



యక్షపర్వతం



Printed and Published by B. Viswanatha Reddi at B.N.K Press Pvt. Ltd., Chennai–600 026 on behalf of Chandamama India Limited, No.82, Defence Officers Colony, Ekattuthangal, Chennai - 600 097. Editor: Viswam



BOSS



LAMBADA



PIRANHA



BUZZ




MISSILE



TERMINATOR



LIMBO



SALSA

# Choose your Hero

Different minds think differently. Go different ways. Make different choices. What better excuse for making so many different bikes?








సంచాలకులు

చక్రపాణి. బి.నాగిరెడ్డి

# చిన్నారుల స్నేహహస్తం!

అది ఒక విషాద శుక్రవారం. దేశమంతటా రిపబ్లిక్ దినోత్సవాలు జరుగుతూ ఉండగా, గుజరాత్ కచ్ ప్రాంతాన్ని భీకర భూకంపం అతలాకుతలం చేసి తీరని శోకాన్ని మిగిల్చి వెళ్ళింది. ఆ సంగతి తెలియగానే, కంటికి దెబ్బ తగిలితే ఆదుకునే చేయిలాగా దేశం దేశమంతా ముందుకు వచ్చింది. ప్రజలందరూ చేతనైన సాయం అందించారు.

ఒక్క భారతదేశం నుంచే కాదు. దూరతీరాలలోని విదేశాల నుంచి కూడా అశేష స్నేహహస్తాలు ముందుకు వచ్చాయి. అప్పుడప్పుడే అమెరికా అధ్యక్ష పదవిని చేపట్టిన జార్జ్ బుష్, "భూకంపాలకు రాజకీయ సరిహద్దులు లేవు!" అని అన్నారు. బ్రిటిష్ ప్రధాని టోనీ బ్లెయిర్, "మేము చేయగల సాయం చేయడానికి సిద్ధంగా ఉన్నాం," అని చెప్పి ఆపద సమయంలో అండగా నిలిచారు. పాకిస్తాన్ సైనిక పాలకుడు జనరల్ ముషారఫ్ సైతం భారత ప్రధానికి ఫోను ద్వారా సానుభూతి తెలియజేశారు.

ఇలా చెప్పుకుంటూ వెళితే జాబితా పెరుగుతూ పోతుంది. అయినా, దీనికి సంబంధించి టోక్యోలో జరిగిన ఒక విశేషం గురించి ఇక్కడ తప్పక చెప్పుకోవాలి. ఆరవ తరగతి చదువుతూన్న పన్నెండేళ్ళ ఇసోవా కకూచీ అనే చిన్నారి ఇండియాలో జరిగిన దుర్ఘటన గురించి విని తల్లడిల్లిపోయింది. తనలాగే మరో ఇరవైమంది విద్యార్థినులతో కలిసి తాము అంతవరకు పొదుపు చేసిన చిన్న చిన్న మొత్తాలను తీసుకుపోయి తమ ఉపాధ్యాయినికి ఇచ్చి భారత్‌కు పంపమన్నది! ఆ చిన్నారులు, "మీరు అనుభవిస్తూన్న బాధ మాకూ బాధ కలిగిస్తున్నది!" అని తెలియజేశారు.

ఆపద సమయంలో నిండు మనసుతో ఆదుకుని నిజమైన స్నేహితులని నిరూపించిన కరుణాహృదయులందరికీ, హృదయపూర్వక కృతజ్ఞతలు తెలియజేస్తున్నాము.











# పరోపకారి పాపన్న

ఇది వి.యస్.ఎన్. కమ్యూనికేషన్స్
వారి కానుక!

## 'పరోపకారి పాపన్న' కథలు



చందమామలో మూడున్నర దశాబ్దాల క్రితం పాఠకులను అలరించిన 'పరోపకారి పాపన్న', తన త్యాగగుణం, మంచితనం, కరుణ, దుష్టశిక్షణకు, శిష్టరక్షణకు సాయపడే మనస్తత్వంతో తెలుగువారి లోగిలిలో ఒక ఇతిహాస పాత్రగా నిలిచాడు. నేటికీ అతని గుణగణాలను ప్రతి ఇంటా కథలు కథలుగా చెప్పుకోవడం మనం వింటున్నదే. బాలలకు ఎంతో ఆదర్శప్రాయమైన 'పరోపకారి పాపన్న' ఇప్పుడు బుల్లితెరపై వారం వారం ఆసక్తికరమైన సన్నివేశాలతో ఇంటిల్లిపాదికీ మరింత వినోదాన్నీ, విజ్ఞానాన్నీ, వికాసాన్నీ కలిగించే విధంగా మీ ఇంటికే వస్తున్నాడు.

ప్రతి గురువారం
రాత్రి 7-30 గంటలకు
హైదరాబాదు
దూరదర్శన్ (డిడి 1)లో
ప్రసారం!

తప్పక చూడండి!

# పాఠకుల లేఖలు

చందమామ పత్రికను కొత్త అందాలతో, ఒరవడితో, కొనసాగిస్తున్నందుకు అభినందనలు. నేను 1960 నుంచే చందమామ పాఠకుణ్ణి.

ఫిబ్రవరి 2001 చందమామ సంపాదకీయంలో 'మీ తాతలు, తండ్రులు చదివిన రోజులకన్నా ఇవాళ చందమామ మరింత ఆకర్షణీయంగా ఉంద'ని రాశారు. కాని నాకైతే '60లలో '70 లలోనే చందమామ చాలా చక్కగా, ఉల్లాస భరితంగా, చదవ కుతూహలంగా ఉండేది.

ఏది ఏమైనా అపూర్వ కళాఖండం అనదగ్గ చందమామ మన భారతీయుల సుస్థిరాస్తి. దాన్ని చూసీ, తలచుకునీ మేం చాలా గర్విస్తాము. అనేక అభివందనలతో,

—గోపీనాథ్, ఒంగోలు (ఆం.ప్ర)

గత 45సం॥లుగా చందమామను రెగ్యులర్‌గా చదువుతూన్న పాఠకుణ్ణి. కాలక్రమాన వస్తూన్న మార్పులు అనివార్యమేమోగాని, కథల స్థానాన్నిశీర్షికలు ఆక్రమించడం మాలాంటి పాఠకులకురుచించడంలేదు. లోగడ మీప్రశ్నావళికి ఎలాంటి సమాధానాలు వచ్చాయి? ఈ ఉత్తరాన్ని దృష్టిలో పెట్టుకుని మళ్ళీ అభిప్రాయ సేకరణ చెయ్యకూడదా?

—డి.ఎస్.శంకర్, వక్కలంక, తూ.గో.జిల్లా.

మనందరికీ ప్రియమైన చందమామ పత్రికలో గతంలో ప్రచురితమైన 'యక్షపర్వతం' మళ్ళీ ప్రారంభం కావటంతో ఎన్నో ఏళ్ళుగా ఎదురుచూస్తూన్న మాకు చాలా ఆనందం కలిగింది. చక్కని కథలు ప్రచురిస్తూన్న చందమామకు ధన్యవాదాలు.

—శాస్త్రి, మచిలీపట్నం.

మేము గత ఐదు సంవత్సరాలుగా మీ పాఠకులం. మాకు మీ చందమామ బాగా నచ్చింది. ముఖ్యంగా మీరు ప్రచురించే 'యక్షపర్వతం' కథ చాలా బాగుంది.

—కె.సాయి ప్రసన్న, తాడేపల్లిగూడెం (ఆం.ప్ర)

ఈ సంచిక నుంచి 'పాఠకుల లేఖలు' ప్రారంభిస్తున్నాము. చందమామలో నెలనెలా వెలువడే కథలూ, సీరియల్ కథలూ, శీర్షికలూ, ప్రత్యేక శీర్షికలూ మొదలైన వాటిని గురించి పాఠకులు తమ అభిప్రాయాలను క్లుప్తంగా రాసి పంపినట్టయితే, వాటిని ఈ శీర్షికలో ప్రచురిస్తాము.

—సంపాదకుడు



బేతాళ కథలు

# కౌశికుడి తపస్సు!

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్నిదించి భుజానవేసుకుని,ఎప్పటి లాగే మౌనంగా శ్మశానం కేసి నడవ సాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, ''రాజా, ఇంత అర్ధరాత్రివేళ, కన్ను పొడుచుకున్నా కానరాని కటిక చీకటిలో,భీతి గొలిపే ఈ శ్మశానమంతా నిర్భయంగా తిరుగాడుతున్న నీ మనో స్థైర్యం మెచ్చదగిందే. కాని, ఇంతటి దుస్సాహసం, నువ్వు ఏదైనా స్వార్థ కాంక్షతో చేస్తున్నావా లేక పరులమేలుకై పూనుకున్నదా అన్న సంశయం నన్ను బాధిస్తున్నది. మనిషి తను కోరినది సాధించి తీరాలన్న ప్రయత్నంలో,ఎటు వంటి విఘ్నాలకైనా జంకక పోవడం



ప్రశంసనీయం. అయితే, మధ్యలో తను గౌరవించే ఏ ఆత్మబంధువో, గురువోవచ్చి, ఇది నీకు తగనికార్యం అన్నంత మాత్రాన, అంతవరకూ చేసిన ప్రయత్నానికి తిలోద కాలొదలడం వివేకం అనిపించుకోదు. పూర్వం కౌశికుడిలా పరుల మాట నమ్మి భంగపడ్డాడు. నువ్వూ అంత అవివేకంగా ప్రవర్తించకుండా వుండేందుకు అతడి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా, విను,'' అంటూ ఇలా చెప్పసాగాడు:

ఒకానొకప్పుడు గురుముఖుడు అనే పండితుడి గురుకులంలో కౌశికుడనేవిద్యార్థి వుండేవాడు. ఇరవై సంవత్సరాల వయసుకే సకల శాస్త్రాలూ క్షుణ్ణంగా అర్థం చేసుకున్న కౌశికుడికి, తర్వాత ఏం చేయాలో తోచ లేదు. గురువు నడిగితే ఆయన, ''నాయనా! నీలో అపారమైన తెలివివుంది, కానీ ఏకాగ్రత లేదు. కొంతకాలం పాటు తపస్సు చెయ్యి. దేవుడు ప్రత్యక్షమై నీకు కర్తవ్యబోధ చేస్తాడు,'' అని సలహా ఇచ్చాడు.

కౌశికుడు చండకారణ్యం చేరుకుని విశాల మైన ఒక మర్రిచెట్టు నీడలో తపస్సు ప్రారంభిం చాడు. వాడి తపోదీక్ష అద్భుతంగావుండేది. తెల్లవారు ఝామునే లేచి కాలకృత్యాలు తీర్చు కుని ఫలాలను ఆహారంగా భుజించి తప స్సుకు కూర్చునేవాడు. సూర్యాస్తమయవేళకు తపస్సు చాలించి కందమూలాలను తెచ్చు కుని తిని నిద్రపోయేవాడు. ఇలా ఏడు సంవ త్సరాలపాటు కఠోరదీక్ష కొనసాగించినా, వాడికి దేవుడు ప్రత్యక్షంకాలేదు.

అప్పుడప్పుడూ దేశ సంచారానికి వెళ్ళే గురుముఖుడు, దారిలో కౌశికుణ్ణి కలుసు కున్నాడు. కౌశికుడాయనకు తన గోడు విని పించుకున్నాడు.

''తపస్సుకు ఏకాగ్రత చాలాముఖ్యం. నిర్విఘ్నంగా కొనసాగుతున్న నీ తపో సాధ నలో ఏకాగ్రతకు లోటురావడంలేదుకదా?'' అని అడిగాడు గురుముఖుడు.

''లేదు, గురువర్యా!'' అన్నాడు కౌశికుడు.

''సరే! నేను మణిపాలుడనే రాజునుచూడ బోతున్నాను. అక్కడి నుంచి తిరిగివచ్చేట ప్పుడు, నీ సమస్యకు పరిష్కారం చెబు తాను,'' అని గురుముఖుడు అక్కడినుంచి వెళ్ళిపోయాడు.

ఆ సమయంలోనే మణిపాల మహారాజుకు ఒక ఇబ్బంది వచ్చింది. ఎంతో సమర్థుడైన కోశాధికారి మరణించడంతో, కొత్త కోశాధికారి నియామకం, ఆయనకు గడ్డు సమస్యగా పరిణమించింది. పాత కోశాధికారి కోశాగారా

నికి ఎదురుగావున్న ఇంటవుంటూ భార్యా బిడ్డలతో సుఖంగా కాలం గడిపేవాడు. ఎన్ని పనుల్లో వున్నా చివరకు గాఢ నిద్రపోతున్నా కూడా, కోశాగారం చుట్టుపక్కల చీమ చిటుక్కుమన్నా ఆయనకు తెలిసిపోయేది. అందుకాయన ఏకాగ్రదృష్టికారణమనీ-అలాంటి ఏకాగ్రదృష్టి తమకున్నదనీ విరాగుడు, భోగుడు, వేగుడు అనే ముగ్గురు వ్యక్తులు రాజుకు చెప్పుకుని, తమకు కోశాధిపతి పదవి ఇప్పించమని కోరారు.

ఈ ముగ్గురిలో విరాగుడు సంగీత విద్వాంసుడు. భోగుడు మహాభక్తిపరుడు. వేగుడు శ్రమజీవి. ముగ్గురికి ముగ్గురూ ఎంతో నమ్మకస్థులు. వీరిలో ఎవరిని ఎన్నిక చేయాలా అని రాజు ఆలోచిస్తూండగా, గురుముఖుడాయనను కలుసుకున్నాడు. రాజు మణిపాలుడాయనకు ఆనందంతో సకల మర్యాదలూచేసి,తన సమస్య చెప్పుకుని, "అయ్యా, తమరు సమయానికే వచ్చారు! నాకేదైనా ఉపాయం సెలవివ్వండి," అని కోరాడు.

గురుముఖుడు పోటీదారులు ముగ్గుర్నీ పిలిచి, "మీ ఏకాగ్రత ఏపాటిదో పరీక్షించ దలచాను. చండకారణ్యంలోని ఒక విశాలమైన మర్రి చెట్టు నీడలో,కౌశికుడనే నాశిష్యుడు తపస్సు చేసుకుంటున్నాడు. ఆ సమయంలో విరాగుడక్కడ రెండుగంటలసేపు పాటలు పాడాలి. ఏకాగ్రతతో పాడితే రెండుగంటల్లోనూ పాతిక పాటలు పాడవచ్చు. విరాగుడక్కడ పాటలు పాడుతూండగా, భోగుడు శివార్చనకు ముఖ్యమైన ముళ్ళపూలు కోయాలి. ఏకాగ్రదృష్టివుంటే ముళ్ళు చేతికి



అంట కుండా రెండుగంటల్లోనూ నూరు పూవులు కోయవచ్చు. అదేవిధంగా వేగుడా సమయంలో అక్కడున్న చెట్టుమోడును గొడ్డలితో చీల్చి ఏబది కట్టెలుగా చేయాలి," అన్నాడు. పోటీదారులు ముగ్గురూ అందు కంగీకరించారు.

మర్నాడేవాళ్ళూ, రాజూ, కొంతపరివారం, గురుముఖుడు చండకారణ్యంలోని మర్రి చెట్టును చేరుకున్నారు. ఆ సమయంలో కౌశికుడు కళ్ళు మూసుకుని తపస్సు చేసుకుంటున్నాడు. పోటీదారులు ముగ్గురు కూడా తమతమ పనులు ప్రారంభించారు.

రాజు మణిపాలుడు గురుముఖుడితో, "మీ శిష్యుడి తపోదీక్ష చాలా గొప్పది. తన సమీపంలోనే పొద్దుటినుంచి ఇంత గొడవ జరుగుతున్నా, ఏమాత్రం చలించడంలేదు," అన్నాడు.



గురుముఖుడు నవ్వి, ''మనం పరీక్షించా ల్సింది,నాశిష్యుణ్ణికాదు!విరాగుడు,భోగుడు, వేగుడుల ఏకాగ్రత ఎంత గొప్పదో పరీక్షి ద్దాం,'' అని, ఒక భటుణ్ణి కాసేపు ఈల వేయ మన్నాడు. దానికి ఒక్కరూ చలించలేదు. తర్వాత ఇద్దరు భటుల్ని కత్తియుద్ధం చెయ్య మన్నాడు. ఆ భటులు కత్తియుద్ధం చేస్తూ, పోటీదార్లు ముగ్గురి చుట్టూ పరిగెత్తినా, వారు చలించలేదు. తరవాత ఒక భటుడు పులిలా గాండ్రించాడు. పక్షిలా కూశాడు. వరద నీరు ముంచుకు వస్తున్నదని అరిచాడు.

అలా రెండు గంటలు గడిచిపోగానే విరా గుడు సరిగ్గా పాతిక పాటలు పాడాడు. భోగుడు నూరు పూవులు కోశాడు. వేగుడు ఏబది కట్టెలు కొట్టాడు.

''ముగ్గురూ చెప్పిన పనులు సక్రమంగా చేశారు. వీరిలో యోగ్యుడెవరో తమరే సెలవి వ్వండి!'' అంటూ రాజు మణిపాలుడు, గురు ముఖుడిని కోరాడు.

అందుకు గురుముఖుడు మందహాసం చేసి, ముగ్గురినీ దగ్గరకు పిలిచి, ''మీ ఏకా గ్రతకు అసలు పరీక్ష వేరేవున్నది. మీరు మీ పనులు చేస్తున్నంతకాలం, మీ చుట్టూ ఏమేం జరిగిందో సరిగ్గా చెప్పాలి,'' అన్నాడు.

అయితే విరాగుడిక్కానీ, భోగుడిక్కానీ, వేగుడిక్కానీ – తమ చుట్టూ భటులు ఈలలు వేశారనీ, కత్తి యుద్ధాలు చేశారనీ, జంతు వుల్లా, పక్షుల్లా అరిచారనీ తెలియనే తెలి యదు. విరాగుడి దృష్టంతా తన పాటల మీద, భోగుడి దృష్టంతా పూలమీద, వేగుడి దృష్టంతా కట్టెలమీద. వారి ఏకాగ్రతకు రాజే ఆశ్చర్యపోయాడు.

''వీరి ముగ్గురిలో యోగ్యుడెవరో నిర్ణ యించడానికి మేధాశక్తి చాలదు. అందుకు కావలసిన తపోశక్తి, నాశిష్యుడి కున్నది,'' అని గురుముఖుడు, ''కౌశికా! కౌశికా!'' అంటూ శిష్యుణ్ణి పిలిచాడు.

కౌశికుడు పలకలేదు. అలా పదిసార్లు పిలిచి గురుముఖుడు ఊరుకున్నాడు.

రాజు, కౌశికుడి ఏకాగ్రతకు అచ్చెరు వందాడు.వాడిని అభినందించాలని ఆయన అక్కడే వేచి వుండగా, సూర్యాస్తమయం కాగానే కౌశికుడు కళ్ళు తెరిచాడు.

''మా వల్ల నీకు తపోభంగం కాలేదుకదా, నాయనా?'' అన్నాడు గురుముఖుడు.

ఆ ప్రశ్నకు కౌశికుడు తృప్తిగా తలాడించి, ''గురువర్యా! ఉదయం నేను తపస్సు ప్రారం భించాక ఇటుగా వెళ్ళిన రెండు ఏనుగులను సింహం తరిమింది.తర్వాత నాలుగుజింకలు

ఇక్కడ తచ్చాడాయి. ఒక మనిషి పాతిక పాటలు పాడాడు. ఇంకొకడు మధ్య మధ్య అబ్బా అంటూ,ముళ్ళపూలు కోశాడు.ఒకడు కట్టెలు కొట్టాడు. ఎవరో ఈల వేశారు. ఇంకె వరో కత్తియుద్ధం చేశారు. పులి అరుపులూ, పక్షికూతలూ, వరదనీరు ముంచెత్తు కొస్తుం దన్న బెదిరింపులూ విన్నాను. తర్వాత నన్ను తమరు పదిసార్లు పిలిచారు. ఇలా పలు రకాలుగా నా ఏకాగ్రతకు భంగం కలిగించే పనులు జరిగినా, నేను చలించకుండా సూర్యాస్తమయంవరకూ తపస్సు కొనసాగిం చాను.ఇప్పటికి మీకు,నాఏకాగ్రతపై నమ్మకం కుదిరివుండాలి!'' అన్నాడు.

ఆ జవాబుకు గురుముఖుడు మంద హాసం చేసి రాజుతో, ''రాజా, తమరు సూక్ష్మ గ్రాహులని నాకు తెలుసు! విరాగుడూ, భోగుడూ, వేగుడుల ఏకాగ్రతతోపాటు, నా శిష్యుడి తపస్సు గురించీ విన్నారుగదా. కోశా గారానికి ఎదురుగావున్న మరణించిన కోశాధి కారి గృహాన్ని, నా శిష్యుడు కౌశికుడికిచ్చి, అతణ్ణి కొత్త కోశాధికారిగా నియమించండి. చీమ చిటుక్కుమన్నా తెలుసుకుని, కోశా గారాన్ని కాపాడకలుగుతాడు,'' అన్నాడు.

ఇందుకు రాజు సంతోషించి సరే అన్నాడు. అయితే, కౌశికుడు మొహం చిన్నబుచ్చు కుని, ''గురువర్యా!'' అంటూ ఏదో చెప్ప బోయేంతలో గురుముఖుడు,అతణ్ణివారించి, ''నాయనా! నువ్వు మణిపాల మహారాజుకు కోశాధిపతివై, పుట్టుకతో అబ్బిన సమర్థతకు మరింతగా మెరుగులు దిద్దుకుని గృహస్థాశ్ర మాన్ని స్వీకరించి కలకాలం సుఖంగా జీవించు.అటు నీకూ,ఇటు రాజ్యానికీ ప్రయో జనకరమవుతుంది!'' అంటూ,అక్కడి నుంచి తన గురుకులానికి బయల్దేరాడు.



బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, గురుముఖుడు రాజుమణిపాలుడికిచ్చిన సలహా యుక్తియుక్తంగానూ, వివేకవంతంగానూ వున్నట్టుకనబడదు. సకల శాస్త్రాలూ క్షుణ్ణంగా అర్థం చేసుకుని, దైవదర్శనం కోసం కఠోర తపస్సుచేస్తున్న కౌశికుణ్ణి,కోశాధికారిగా నియమించమనడం విడ్డూరంగానూ, అసందర్భంగానూలేదా? అదే సమయంలో,ఎంతో ఏకాగ్రచిత్తులైన విరాగుడూ, భోగుడూ, వేగుడూ అనే వాళ్ళను, గురుముఖుడు కించపరిచినట్టు కనబడుతున్నది. రాజును సూక్ష్మగ్రాహి అంటూ ఆయన పొగడడం ఒట్టి వాచావాత్సల్యమా లేక అందులో అంతరార్థమేమైనా వున్నదా? ఈ సందేహాలకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలి పోతుంది," అన్నాడు.

దానికివిక్రమార్కుడు, "ఏ మనిషి అయినా తాను ఎంచుకున్న వృత్తివ్యాపకాల్లో అగ్రశ్రేణి వాడనిపించుకోవాలంటే, అందుకు కేవలం తెలివితేటలే కాక ముఖ్యంగా ఏకాగ్రత అవసరం. అది విరాగుడూ, భోగుడూ, వేగుల లాంటి వాళ్ళల్లో స్పష్టంగా కనబడుతున్నది. కాని, తపస్సుతో ఎంతో ఘనకార్యాన్ని సాధించాలనుకున్న కౌశికుడిలో,ఆఏకాగ్రతఏమాత్రం కనిపించదు. ఏ విషయాన్నయినా క్షుణ్ణంగా అర్థం చేసుకోవడంవేరు,దాన్ని కార్యసాధనకు అనుకూలంగా మలచుకోవడంవేరు. కౌశికుడిలో అలాంటి సత్తాగాని, నేర్పు ఓర్పులు గానిలేవు. ఆకారణంగానే అతడు, తను కళ్ళు మూసుకుని ఏకాగ్రతగా తపస్సులోవున్నాననుకుంటూనే, తన చుట్టూ జరుగుతున్న స్వల్ప విషయాలను కూడా గుర్తుపెట్టుకుంటున్నాడు. అలాంటివాడే కోశాధిగారానికి సరైన అధిపతి కాగలడు! ఇక, ఆ పదవి ఆశించివచ్చిన ముగ్గురూ, తామనుకున్న ఆయావృత్తుల్లో గొప్ప ఏకాగ్రచిత్తులు. వాళ్ళ శక్తిసామర్థ్యాలు ఆయావృత్తులకు మాత్రమే పరిమితం! అందువల్ల, వాళ్ళు కోశాగార బాధ్యతలకు అర్హులుకారు. తాను చెప్పిన కొద్ది మాటల ద్వారా రాజు, తన సమస్యకు పరిష్కారమేమిటో గ్రహించగలడన్న నమ్మకంతోనే, గురుముఖుడు ఆయనను సూక్ష్మగ్రాహి అని పొగడాడు, అది ఒట్టి వాచావాత్సల్యం కాదు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహామాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)

[ఆధారం : "వసుంధర" రచన]





# యక్షపర్వతం

## 5

[ఖడ్గజీవదత్తులు సింహాన్ని మరొక శిథిల భవనంలోకి తరిమి, ఆ ప్రాంతం నుంచి బయట పడేందుకు దారి వెతుక్కుంటూ బయలుదేరారు. వాళ్ళకు ఒక గదిలో చాలా ధాన్యం బస్తాలు కనిపించినై. వాటికి వాళ్ళు నిప్పు పెట్టారు. అంతలో పక్క గదినుంచి అరుపులు వినిపించినై. వాళ్ళు వెళ్ళి చూడగా పొడవాటి గడ్డంతో బక్కచిక్కిన ఆజానుబాహువైన ఒక వృద్ధుడు కనిపించాడు. తరవాత-]

ఖడ్గజీవదత్తుల్ని చూస్తూనే ఆ వృద్ధుడు, "ఎవరు మీరు? ఆ దొంగపూజారిణి శిష్యుల్లా లేరే? ఎవరైతేనేం, నన్ను రక్షించండి. పక్క గదిలో ధాన్యం కాలిపోతున్నట్టున్నది! ఆ వేడికి నేను బంధించబడిన రాతిగోడ వేడెక్కి, నా శరీరం కాలుతున్నది," అన్నాడు.

"కొంచెం ఆగితే మొత్తం గదికప్పే లోపలికి కూలిపోతుంది!" అంటూ జీవదత్తుడు, వృద్ధుణ్ణి సమీపించి, దండంతో అతడి చేతులకు కట్టి వున్న గొలుసులను విరగ్గొట్టి, అతణ్ణి గదినుంచి బయటికి తీసువచ్చాడు.

వృద్ధుడు ఆత్రంగా చుట్టూ ఓమారు కలయ చూసి, "ఎన్నాళ్ళ తర్వాత నాకు తిరిగి స్వేచ్ఛ కలిగింది. ఆ దొంగ పూజారిణి ఇంకా, ఈ శిథిల నగరంలో అధికారం చెలాయిస్తున్నదా? మీరెవరు?" అని అడిగాడు.

దానికి జీవదత్తుడు, "నీ మాటలు వింటూంటేనువ్వే ఇక్కడ అసలు పూజారివనీ, ఇప్పుడు గద్దె ఎక్కి కూర్చున్న పూజారిణే నిన్నీ గదిలో బంధించిందనీ తెలుస్తున్నది. అవునా? మేం మాత్రం ఆవిడ శిష్యులం కాదు," అన్నాడు.

"చాలా సంతోషం! ఆ నీచురాలు ఇప్పటికి ఇరవైఏళ్ళ క్రితం, ఇంత బాలికగా నాకు అరణ్యంలో దొరికింది; తెచ్చి సాకాను. కాని, ఏమాత్రం కృతజ్ఞత లేకుండా రెండేళ్ళ క్రితం,



ఒక భయంకర కాళరాత్రి వేళ, పెద్ద ఉరుములూ, మెరుపులతో కుండపోతగా వర్షం కురుస్తున్న సమయంలో...''

జీవదత్తుడు, వృద్ధుడి మాటలకు అడ్డు వచ్చి,'' మీ గత చరిత్ర అంతా వినే తీరుబాటు మాకులేదు. పూజారిణి బారినుంచి బయటపడి,అరణ్యం చేరాలని చూస్తున్నాం. మీరిక్కడే వుంటారా లేక ఈ కాలిపోతున్న కొంపల్లోంచి, మా వెంట అరణ్యం చేరతారా? ముందు ఆ సంగతి చెప్పండి,''అన్నాడు.

ముసలి మాంత్రికుడు ఒక క్షణ కాలం మౌనంగా వూరుకుని, తర్వాత కీచు గొంతుతో,''పగ తీర్చుకోకుండా-ఆ దొంగ పూజారిణిని హతం చెయ్యకుండా, నేనిక్కడి నుంచి కదలను. నన్ను ఈ స్థితిలో చూస్తే, నా పాత శిష్యులు కొందరు తప్పక నాపక్షం అవుతారు. వాళ్ళ సాయంతో ఆ నీచురాల్ని పట్టుకుని ముక్కలు ముక్కలుగా నరికి కాకులకూ, గద్దలకూ ఆహారంగా వేస్తాను,'' అన్నాడు.

జీవదత్తుడు ఏదో చెప్పబోయేంతలో పూజారిణీ, మాంత్రికుడూ, జడలభూతంతో పాటు అక్కడికి వచ్చి, ''ఆహా, ముసలి వెధవ చీకటి కొట్లోంచి బయట పడ్డాడా? వీళ్ళందర్నీ పట్టుకుని మహాభూతానికి బలిచేస్తాను,'' అంటూ ముందుకు రాసాగింది.

ఖడ్గవర్మ చప్పున బాణం పూజారిణి కేసి ఎక్కుపెట్టి, ''పూజారిణీ! మరొక్క అడుగు ముందుకు వేశావంటే, ఈ వాడి అంబు నీ కంఠాన్ని ఛేదిస్తుంది, జాగ్రత్త!''అన్నాడు.

పూజారిణి భృత్యుల్లో ఒకడు తన చేత గల శూలాన్ని గాలిలో గిరగిరా తిప్పి, ''మహాశక్తి పూజారిణీ! ముసలి పూజారినీ, ఈ కొత్త వాళ్ళిద్దర్నీ,నీ మంత్రశక్తితో భస్మం చేసెయ్యి,'' అన్నాడు.

''ఊహూ,అలా భస్మం చెయ్యను.ముగ్గుర్నీ పట్టుకుని మహాభూతానికి బలిపెట్టాలి,'' అంటూ పూజారిణి పక్కనే వున్న మాంత్రికుడూ, జడలభూతాలతో, ''ఒరే, అలా నిలబడి నేలచూపులు చూస్తారేం?అందర్నీ కలిపి పట్టుకోండి!'' అన్నది పళ్ళు కొరుకుతూ.

ఆ మాటలకు జీవదత్తుడు నవ్వి, ''ఏరా, వికృతభూతం! నువ్వు ఆడభూతానివో, మగ భూతానివోకూడా తెలియడంలేదు. మమ్మల్ని పట్టుకోక అలా నిలబడి వున్నావేం?''అని అడిగాడు.

జడలభూతం ఆ మాటలకు బెదిరి, మాంత్రికుడితో,''గురో,ఈ ఇద్దర్నీ పట్టుకుని విరుచుకు తినేదా?''అన్నది.

"తప్పురా, శిష్యా, తప్పు! మహాపూజారిణి వాళ్ళను ప్రాణాలతో పట్టుకుని, మహాభూతానికి ఆహారం చేయబోతున్నది. మనం తొందర పడకూడదు," అన్నాడు మాంత్రికుడు.

వృద్ధ పూజారి పెద్దగా గొంతెత్తి, "ఇప్పుడా గురుద్రోహికి ఎలాంటి మంత్రశక్తులూ లేవు. లోగడ నేను దానికిచ్చిన మంత్రశక్తినంతా ఉపసంహరించేశాను," అన్నాడు.

"అంతా అబద్ధం! ఈ ముసలి ముచ్చు మాటనమ్మకండి," అంటూ పూజారిణి అరిచి, వృద్ధపూజారి కేసి కదిలింది.

"ఆగు!" అంటూ ఖడ్గవర్మ బాణాన్నిఆ మె శూలం పట్టుకున్న చేతికి గురిచేసి కొట్టాడు.

శూలం ఆమె చేతినుంచి జారి కింద పడి పోయింది.అది చూస్తూనే,అక్కడవున్న ఆమె శిష్యుల్లో ఇద్దరు, "పూజారిణి మంత్రశక్తి పోయింది. ఇక మా గురువు వృద్ధ పూజారే!" అంటూ కేకలు ప్రారంభించారు.

అంతలో అక్కడికి మరికొందరు శిష్యులు వచ్చారు. వృద్ధపూజారి పరమానందంతో, "ఆహాహా, మహాభూతా! ఎన్నాళ్ళకెన్నాళ్ళకు నా శిష్యగణం సత్యం తెలుసుకుని, అంధ కారం నుంచి వెలుగులోకి వచ్చేలా చేశావు! ఇక నీకు గతకాలంలోలాగే ప్రాణుల బలిని ఇతోధికంగా చేస్తాను," అంటూ గడ్డం సవ రించుకుని,చేతులు జోడించి పైకెత్తాడు.

జీవదత్తుడు, వృద్ధ మాంత్రికుడి కేసి ఒక సారి చూసి, ఖడ్గవర్మతో, "ఖడ్గా, ఈ ముసలి మాంత్రిక పీనుగా క్రౌర్యంలో పూజారిణికి ఏమాత్రం తీసిపోయేవాడిలా లేడు," అని, అక్కడ చేరిన మాంత్రికుల శిష్యగణంతో, "మీ నాయకత్వపు తగాదాల్లోమేం తలదూర్చ బోవడంలేదు," అన్నాడు.



అంతలో వృద్ధపూజారి పక్షం వాళ్ళూ, పూజారిణి పక్షం వాళ్ళూ రణగొణ ధ్వనిగా అరుస్తూ కలబడి కొట్టుకోసాగారు.

అది చూసి ఖడ్గవర్మ, "జీవా, ఈ కొట్లా టలో ఈ దొంగ మాంత్రికులూ, శిష్యగణం చచ్చేలా వున్నారు," అన్నాడు.

"చచ్చు వెధవలందర్నీ చావనీ! ఈ శిథిల భవనాల్లో చిక్కివున్న సింహానికైనా కొంతకాలం పాటు ఆకలితో డొక్కమాడే అవస్థ తప్పు తుంది," అన్నాడు జీవదత్తుడు.

ఆ తర్వాత ఖడ్గవర్మ కత్తి ఝుళిపించి, "ఒరే, మాంత్రికా! నీ శిష్య జడలభూతంతో కలిసి, మాకు ఈ శిథిలాలనుంచి బయటికి వెళ్ళే మార్గం చూపించు," అన్నాడు .

"మహాప్రసాదం, మహాసత్వుల్లారా!" అంటూ మాంత్రికుడూ, జడలభూతం ముందుండి దారితీయగా, ఖడ్గజీవదత్తులు,



గడిచిన రాత్రి శిథిలనగరంలోకి ప్రవేశించిన సారంగం వెంట పోయి, అరణ్యం కేసివున్న గుహద్వారాన్ని చేరారు.

అక్కడ వాళ్ళు గుహనుంచి కిందికి దిగి, చుట్టూ ఓమారు కలయచూసి, మాంత్రికుడూ, జడలభూతాలతో, "ఇక మీరు మీ శిథిల భవనాలకు పోయి మహాభూతాన్ని భక్తితో ఆరాధిస్తూ తరించండి," అన్నారు నవ్వుతూ.

"గొప్పగా సెలవిచ్చారు, మహా సత్త్వుల్లారా! మేం ఈ జన్మలోనే కాదు, వచ్చే జన్మలో కూడా ఆ మహాభూతాన్ని సేవించుకుంటాం. జీవులకు అంతకన్న కావలసినదేమున్నది!" అంటూమాంత్రికుడూ,జడలభూతం అక్కడి నుంచి వెనుదిరిగారు.

అంతలో కొండమీద కలవరం ప్రారంభమైంది. ఒంటె ఒకటి, మీదవున్న మనిషితో సహా కొండ అంచు నుంచి జారి తలకిందులుగా దిగువనున్న పల్లంలోకి దభీమని పడిపోయింది.

అది చూస్తూ ఖడ్గజీవదత్తులు అటుకేసి పరిగెత్తారు. ఒంటె కాళ్ళు విరిగి గిలగిల తన్నుకుంటూనేల మీద దొర్లుతున్నది.దానితో పాటు కింద పడినవాడు మాత్రం మోకాలును రెండు చేతులతో పట్టుకుని పళ్ళబిగువున బాధను సహిస్తూ, చిన్నగా మూలుగుతున్నాడు. వాడు బందిపోటు ముఠాలోనివాడని, వాడి దుస్తుల తీరు చూసి ఖడ్గజీవదత్తులు పోల్చుకున్నారు.

జీవదత్తుడు,బందిపోటువాణ్ణిసమీపించి, "ఒరే, బందిపోటు బాబూ! నీదెలాంటి మొండిప్రాణం! అంత ఎత్తు కొండ మీది నుంచి పడి ఒంటె చావు బతుకుల మధ్య వున్నది కాని, నువ్వు మాత్రం చెక్కు చెదరక పిడిరాయిలా వున్నావు?" అన్నాడు.

బందిపోటువాడు కళ్ళింత చేసి వణికిపోతూ, "అయ్యా, నన్ను చంపకండి! ఖడ్గజాతి వాళ్ళ పంటపొలాలు దోచిన వాళ్ళల్లో నేను లేను.నిజానిజాలు స్వర్ణాచార్యులుగారి నడిగి మీరు తెలుసుకోవచ్చు," అన్నాడు.

వాడి మాటలు వింటూనే ఖడ్గజీవదత్తులు పొందినఆశ్చర్యం అంతా ఇంతా కాదు.వాళ్ళకు స్వర్ణాచారి సజీవుడేననీ, బందిపోట్ల దగ్గర వున్నాడనీ తెలిసిపోయింది.

ఖడ్గవర్మ, వాడికి కత్తి జూపి బెదిరిస్తూ, "ఒరే, నిజం చెప్పు! ఖడ్గజాతి వాళ్ళ పంటలు దోచుకున్నవాళ్ళల్లో నువ్వు లేకపోతే–మమ్మల్ని ఖడ్గజాతి వాళ్ళపక్షం మనుషులమని ఎలా గుర్తించావు?" అని అడిగాడు.

''అయ్యా, అరణ్యంలో మిమ్ములను చూసిన నామిత్రుల ద్వారా, మీ వస్త్రధారణా, పట్టిన ఆయుధాల సంగతీ విని, మిమ్మల్ని చూస్తూనే గుర్తించాను. ఇందులో అబద్ధం లేదు,'' అన్నాడు బందిపోటువాడు.

''ఆహా, నువ్వు బుద్ధికి బృహస్పతివి! ఎక్కడైనా గురుకులం పెట్టి శిష్యులకు విద్యా బోధ చెయ్యక, ఈ దారిదోపిడీ ముఠాలో ఎందుకు చేరావు?'' అంటూ ఖడ్గవర్మ పెద్దగా నవ్వి, ''ఆ రాళ్ళూ రప్పలూ కొండ మీద ఒంటెలచేత లాగించుకు పోతున్నారే అవి ఎందుకు? ఎక్కడికి?'' అని అడిగాడు.

''అయ్యా, స్వర్ణాచార్యులవారు, మా నాయకుడు స్థాపించబోయే రాజ్యానికి రాజ ధానీ నగరం, పెద్ద కోటా నిర్మించబోతున్నారు. వారి ఆజ్ఞ ప్రకారం, రాళ్ళను ఒక సమతల ప్రదేశానికి చేరవేస్తున్నాం,'' అన్నాడు బంది పోటువాడు.

వాళ్ళిలా మాట్లాడుకుంటూండగా, కొండ మీదినుంచి బందిపోట్లలో నలుగురు, ఖడ్గజీవ దత్తులను గుర్తించి, ఆ సంగతి స్వర్ణాచారికి చెప్పారు. స్వర్ణాచారి పరమానందభరితుడై పోయి, బందిపోట్లను వెంటబెట్టుకుని, వాళ్ళ దగ్గరకు వచ్చి వినయంగా నమస్కరించాడు.

జీవదత్తుడు నవ్వుతూ స్వర్ణాచారి భుజం తట్టి, ''స్వర్ణాచారీ, ఎలా వున్నావు? చూడగా, నువ్వు కూడా బందిపోట్లకు ఒక చిన్న నాయ కుడివై పోయినట్టుంది!'' అన్నాడు.

ఆ మాటలకు స్వర్ణాచారి ఒక క్షణకాలం నిశ్చేష్టుడైపోయి, ''ప్రభువులు మన్నించాలి! నేను తప్పనిసరై బందిపోట్ల నాయకుడు సమరబాహుకు వాస్తుహితంగా కోట కట్టి



పెడుతున్నాను. ఆ పని పూర్తికాగానే, నా దారిన నేను పోయి విఘ్నేశ్వర పూజారిని కలుసు కుని, తర్వాత ఇద్దరం ఏ ఘోరారణ్యంలోనో తపస్సు చేసుకుంటాం,'' అన్నాడు.

''చాలా మంచి ఆలోచన. ఖడ్గజాతివాళ్ళ దగ్గర సుఖంగా బతుకుతున్న పూజారి, నీతో పాటు తపస్సుకు బయలుదేరుతాడోలేదో మరి!'' అన్నాడు జీవదత్తుడు.

''అంతా దైవేచ్ఛ!'' అని, స్వర్ణాచారి, ఖడ్గజీవదత్తులతో, ''ఇక నా నివాసానికి పోదాం రండి, భోజనంచేసి విశ్రాంతి తీసుకోవచ్చు,'' అంటూ ముందుండి దారితీశాడు.

వాళ్ళు కొండ ఎక్కి, స్వర్ణాచారి నివాసాన్ని సమీపిస్తూన్నంతలో, అక్కడ ఎలుగుబంటి చర్మాలు ధరించిన ఒకడి చుట్టూ కొందరు బందిపోట్లు చేరి గొడవ గొడవగా మాట్లాడు తున్నారు. స్వర్ణాచారి వాళ్ళను కసురుతూ,

''ఈ గొడవంతా ఏమిటి? ఎలుగుబంటి వేషం వేసి తైతక్కలాడుతున్నవీడెవడు?'' అన్నాడు.

ఎలుగుబంటి చర్మాలు కట్టుకున్నవాడు, స్వర్ణాచారికి వంగి నమస్కారంచేసి, ''అయ్యా, స్వర్ణాచార్యులవారూ! ఈ చర్మాలు నేను కావాలని కట్టుకున్నవికావు. నేను ఉదయం నాయకుడితో వేటకై అరణ్యంలోకి వెళ్ళిన ఇద్దరిలో ఒకణ్ణి. నాయకుణ్ణి అక్కడ ఎవరో మహా క్రూరులైన ఆటవికులు పట్టుకుని తీసుకుపోయారు. నేను వాళ్ళకు దొరక్కూడా, అతి సాహసంతో తప్పించుకుని పారిపోయి వచ్చాను,'' అన్నాడు.

''బందిపోట్లనాయకుడైన సమరబాహుణ్ణి ఆటవికులు పట్టుకుపోయారా! అంత గొప్ప సమరశూరుణ్ణి పట్టగలిగిన ఆటవికులీ ప్రాంతాల ఎక్కడున్నారు?'' అన్నాడు ఖడ్గవర్మ చిరునవ్వు నవ్వుతూ.

''ఖడ్గా, వాడెంత దుర్మార్గుడైనా, వాడికన్న దుర్మార్గుల చేతుల్లో చిక్కినట్టుంది. నవ్వకు, పాపం!'' అన్నాడు జీవదత్తుడు.

బందిపోట్ల నాయకుడు, ఆటవికులకు బందీ అయ్యాడనే వార్త వింటూనే స్వర్ణాచారి నిలువెల్లా కంపించిపోయాడు. అతడు మొదట్లో బందిపోట్లకు ఖైదీగా చిక్కినా, తరవాత వాళ్ళు అతణ్ణి ఎంతో గౌరవాదరాలతో చూడసాగారు. నాయకుడు సమరబాహుకూ, స్వర్ణాచారికీ మంచి మైత్రీస్నేహాలు కూడా ఏర్పడ్డాయి.

''ఖడ్గజీవదత్త ప్రభువుల్లారా! మహా భయంకర విపత్తు ఇది. మీరు శక్తిమంతులు, ఎలాగైనా సమరబాహును, ఆ ఆటవికుల నుంచి విడిపించే ప్రయత్నం చేయాలి,'' అన్నాడు స్వర్ణాచారి దీనంగా ముఖంపెట్టి.

జీవదత్తుడు, ఖడ్గవర్మకేసి చూశాడు. ఖడ్గవర్మ, ''ఒరే, మీ నాయకుణ్ణీ, నీ తోటివాణ్ణీ ఆటవికులు ఎట్లా పట్టుకోగలిగారు? అసలు అరణ్యంలో ఏం జరిగింది? ఆ సంగతంతా ముందు చెప్పు,'' అన్నాడు.

ఎలుగుబంటుచర్మాల బందిపోటువాడు, ''అయ్యా, అరణ్యంలో జరిగిందంతా కొద్ది మాటల్లో చెప్పేస్తాను. మీరు త్వరగా సాయం వచ్చి రక్షించకపోతే, మా నాయకుణ్ణి క్రూరులైన ఆ నరభక్షకులంతా కలిసి కాల్చుకు తిన్నా తినవచ్చు,'' అన్నాడు. —(ఇంకావుంది)





## బాలరచయితలకూ, చిత్రకారులకూ ఆహ్వానం!

## పిల్లల ప్రత్యేక సంచిక గా వెలువడనున్న

## నవంబర్ 2001 చందమామకు మీ రచనలనూ, చిత్రాలనూ పంపండి!

<u>బాలరచయితలకు</u> ఐదువందల నుంచి, వెయ్యి పదాలకు మించకుండా చక్కని కథలను ఆలోచించి రాసి, మంచి పేరు పెట్టి పంపండి. లేదా పజిల్స్, జోక్స్, పొడుపుకథలు రాసి పంపండి. తెలుగు, తమిళం, కన్నడం, మలయాళం, హిందీ, బెంగాలీ, ఒరియా, మరాఠీ, గుజరాతీ, ఇంగ్లీషు భాషలలో ఏ భాషలోనైనా సరే ఒక్కొక్కరు మూడు ఎంట్రీల వరకు పంపవచ్చు. మీ రచనలకు చిత్రాలు/వర్ణచిత్రాలు వేయగల మిత్రులు గనక మీకు ఉన్నట్టయితే, వాళ్ళ చేత తగిన చిత్రాలు గీయించి మాకు పంపండి. అవి బావున్నట్టయితే, మీ మిత్రులను మా ఖర్చులతో చెన్నయ్‌కి రప్పించి, వాళ్ళచేత ప్రత్యేక సంచికకు ఎంపికయిన రచనలకు చిత్రాలు వేయిస్తాం.

<u>బాలచిత్రకారులకు</u> సుప్రసిద్ధ పౌరాణిక దృశ్యాన్ని గాని, చారిత్రక ఘట్టాన్ని గాని (దాని వివరణతో) చిత్రంగా/వర్ణచిత్రంగా వేసి మాకు పంపాలి. ఒక్కొక్కరు మూడు ఎంట్రీల వరకు పంపవచ్చు. వచ్చిన వాటిలో ఉత్తమమైన వాటిని ఎంపిక చేసి, వాటిని వేసి పంపిన చిత్రకారులను చెన్నయ్‌కి మా ఖర్చులతో రప్పించి, ప్రత్యేక సంచిక కోసం ఎంపికయిన కథలకూ, అంశాలకూ వాళ్ళచేత చిత్రాలు వేయిస్తాం.

**ఎంట్రీలు మాకు చేరవలసిన ఆఖరు తేది: జూన్ 7, 2001.**

బహుమతులు : ప్రతిభావంతమైన ప్రయత్నాలకు ఆకర్షణీయమైన బహుమతులు ఉంటాయి.

ఫోటో : మీ ఎంట్రీలతో పాటు పాస్‌పోర్ట్ సైజు మీ ఫోటో ఒకటి జతచేసి పంపండి.

హామీ పత్రం: ఈ పోటీలో పాల్గొనే బాలబాలికలు కింది కూపన్‌లో మీ తల్లి/తండ్రి సంతకం తీసి పంపడం మరిచిపోకండి.

పేరు : .................................................. ..............వయసు/పుట్టిన తేదీ : .......................

తరగతి : ................. పాఠశాల : ..........................................................................

ఇంటి చిరునామా : ..........................................................................................

..........................................................................................................

................................................................................ పిన్‌కోడ్ : ..............................

ఎంట్రీల వివరాలు :-

1. ..............................................................................

2. ..............................................................................

3. ..............................................................................

పైన కనబరచిన ఎంట్రీలు మా అబ్బాయి/అమ్మాయి స్వయంగా మరెవ్వరి సాయం లేకుండా రాసినవి/వేసినవి అని ధ్రువ పరుస్తున్నాను.ఎంపికయిన ఎంట్రీలను తెలుగు భాషలోనూ, ఇతర భాషలలోనూ ప్రచురణ మరియు ఎలక్ట్రానిక్ మీడియాలో వాడుకునే పూర్తి కాపీ రైట్ చందమామకే చెందుతుందని ఇందుమూలంగా సమ్మతిస్తున్నాను.

పాల్గొనే అబ్బాయి/అమ్మాయి సంతకం. తల్లి/తండ్రి సంతకం

ఒక గొప్ప నాగరికతలోని ఘట్టాలు -
తరతరాలుగా సత్యం కోసం జరిగిన అన్వేషణ!

# 16. అహంకారాన్ని జయించిన యోధులు!



"హరిశ్చంద్రుడి కథ అద్భుతం తాతయ్యా! అది విన్నాక ఇక్కడి నుంచి లేవడానికి మనసురావడం లేదు," అన్నాడు సందీపుడు.

"అలా అయితే, మీరు ఇక్కడే కూర్చోండి. నేను వెళతాను,"అంటూ చేతికర్ర అందుకున్నాడు దేవ నాథుడు.

పిల్లలందరూ నవ్వుతూ లేచి నిలబడ్డారు.

"నదీ తీరంలో కొంత దూరం నడుద్దామా?" అన్నాడు దేవనాథుడు.

"అలాగే, తాతయ్యా," అన్నారు పిల్లలు ఒక్క సారిగా.

అందరూ కలిసి కొంతదూరం నడిచారు. నది మలుపు తిరుగుతూన్న చోట పూలచెట్ల మధ్య, అర్థ వృత్తాకారంలో అమర్చిన రెండు సిమెంటు బెంచీలు కనిపించాయి. దేవనాథుడు ఒక బెంచీ మీద కూర్చుంటూ, "నేను ఇక్కడ కొంతసేపు ఉండి వస్తాను. కావాలంటే మీరు ఇళ్ళకు వెళ్ళవచ్చు," అన్నాడు.

"మీరు లేచినప్పుడు లేచాం. మీరు నడిస్తే మీ వెంట నడిచాం. ఇప్పుడు మీరు కూర్చున్నారు. మీ అనుచరులమైన మేమూ కూర్చోవాలికదా?" అన్నాడు సందీపుడు. పిల్లలందరూ నవ్వుతూ బెంచీల మీద కూర్చున్నారు.

"ఉదయిస్తూన్న పూర్ణచంద్రుడు; నిండుగా ప్రవహిస్తూన్న నది; చల్లగా వీస్తూన్న గాలి! ఇవన్నీ మరొక కథ వినడానికి ఆహ్లాదకరమైన వాతావరణాన్ని కల్పిస్తున్నాయి కదా తాతయ్యా?" అన్నది శ్యామల చిన్నగా నవ్వుతూ.

"మన పురాతన చరిత్రను గురించి తెలుసు కోవాలని ఉంది. మా ఉపాధ్యాయులు మనదేశంపై

విశ్వావసు

జరిగిన తొలి దురాక్రమణల గురించీ, మొగలుల దండయాత్ర గురించీ, ఆ తరవాతి పరిణామాల గురించీ ఎంతైనా చెబుతారు. అయితే, మీరు చెప్పే కథలు చెప్పరు ఎందుకని?''అన్నాడు సందీపుడి స్నేహితుడు రాము.

''అది మీ ఉపాధ్యాయుల తప్పుకాదు. సమాజా నిదేతప్పు. మన వలసపాలకులైన బ్రిటిష్ వాళ్ళు సృష్టించి, ప్రవేశపెట్టిన చరిత్ర పాఠాలనే కొద్దిపాటి మార్పులతో ఇంకా మనం చదువుతున్నాం. పోల్చి చూసినట్టయితే, వాళ్ళ పాలన గొప్పగా కనిపించేంత వరకు మాత్రమే వాళ్ళు మన చరిత్రను మనకు చూపారు. వలస పాలకులకు అది సహజం. అందు వల్ల ప్రాచీన కాలానికి సంబంధించిన గొప్ప సంఘ టనలనూ, ఉదాత్త వ్యక్తులనూ ఉదాసీన పరిచారు. లేదా వాటిని పురాణ కథలుగా కొట్టి పారేశారు. అయితే సత్యం అదికాదు. మన పురాణ కథలు చాలావరకు చారిత్రక అంశాలను ఆధారంగా కలిగినవే. పైగా మనం ఈ విషయాన్ని మరొక కోణం నుంచి చూడాలి. ఒక పాత్ర కల్పితమే కావచ్చు. కాని, అది తరతరాల ప్రజల హృదయాల మీద తరగని ముద్ర వేసి, వారి ఆలోచనాధోరణుల మీద ప్రగాఢ ప్రభావం చూప కలిగినప్పుడు-నిజంగా జీవించిన వ్యక్తులకన్నా అది వాస్తవమైనదే కదా? ఏది ఏమైనా యుగయుగాల ప్రజల మనోభావా లకు రూపం కల్పించిన గొప్ప సంఘటనలను గురించీ, వ్యక్తులను గురించీ - అవి చరిత్ర కాక పోయినా వాటిని గురించి తెలుసుకోవడం చాలా అవసరం,'' అన్నాడు దేవనాథుడు.

''అధికారం ఉన్నప్పటికీ ఎంతో వినయంగా నడుచుకున్నాడు హరిశ్చంద్రుడు. మరి అలాంటి రాజులు ఇంకా ఎవరైనా ఉంటే వాళ్ళను గురించి చెప్పండి,''అన్నది శ్యామల.

''అధికార దురహంకారంతో మిడిసి పడిన రాజులు లేరని కాదు కాని, అధికారం, ఐశ్వర్యం ఎంతో ఉన్నప్పటికీ జనక మహారాజులా అహంకార రహితంగా ప్రజాక్షేమమే ధ్యేయంగా,తమను దేవుడి పరికరాలుగా భావించి తమ కర్తవ్యాలను నిర్వర్తిం



చిన మహానుభావులు మనదేశంలో పలువురు ఉన్నారు,''అన్నాడు దేవనాథుడు.

''అహంకారం లేకుండా ఉండడం అంటే అంత కష్టమా తాతయ్యా,'' అని అడిగింది శ్యామల స్నేహితురాలు సుస్మిత.

''అవును తల్లీ! చాలా కష్టం. పరాయి రాజ్యా లను జయించడం కన్నా కష్టమైనది అహంకారాన్ని జయించడం. అయినా అహంకారాన్ని జయించిన సత్యస్వరూపులు చాలామంది ఉన్నారు. వారిని గురించే మనం తరతరాలుగా చెప్పుకుంటున్నాం. జానశృతి మహారాజునే తీసుకుందాం. ఆయన ఆదర్శపాలకుడు. రోజూ రాజోద్యోగులు వచ్చి, ప్రజల క్షేమసమాచారాలు తెలియజేస్తే విన్న తర వాత తప్ప, నిద్రకు ఉపక్రమించేవాడు కాదు,'' అంటూ దేవనాథుడు ఆయన కథ చెప్పసాగాడు:

''ఇది కొన్ని వేల సంవత్సరాలనాటి మాట. ఇవాళలాగే ఆరోజు కూడా నిండు పున్నమిరేయి. రాజు భోజనం ముగించి, రాజప్రాసాదం ఉపరి తలంలో అటూ ఇటూ పచార్లు చేస్తున్నాడు. అప్పుడు కొన్నిహంసలు ఆకాశంలో ఎగురుతూవెళుతున్నాయి.



అవి తమలో తాము ఏవో మాట్లాడుకుంటున్నాయి. జానశృతి మహారాజుకు హంసల భాషతెలుసు. వాటి మాటలను ఆయన జాగ్రత్తగా ఆలకించాడు.

"ఈ రాజప్రాసాదం నుంచి వింత ప్రకాశం కనిపిస్తున్నది. అది మామూలు ప్రకాశంకాదు; దివ్య ప్రకాశం!అది ఏమైఉంటుంది?" అన్నది ఒక హంస.

"అవును, అది దివ్య ప్రకాశమే. ఇంతకు పూర్వం నేను ఇలాంటి వింత కాంతిని ఎక్కడో చూశాను. ఎక్కడా అని ఆలోచిస్తున్నాను. ఆ..జ్ఞాపకం వచ్చింది! రైక్వ మహారాజు భవనం మీదుగా ఎగురుతూన్నప్పుడు కనిపించింది. అయితే అది ఇంతకన్నా గొప్ప ప్రకాశం!" అన్నది రెండవ హంస.

ఆ తరవాత హంసలు కనుమరుగైపోయాయి. ఆ మాటలు విని జానశృతి మహారాజు ఏం చేశాడో తెలుసా? ఆహా నాకన్నా ఉత్తమ పురుషుడు ఉన్నాడు కదా అన్న ఆనందంతో హాయిగా నిద్రపోయాడు.

మరి కొన్నాళ్ళకు రైక్వ మహారాజును గురించి విషయం సేకరించాడు. ఆయన్ను స్వయంగా వెళ్ళి కలుసుకున్నాడు. రైక్వుడు యువకుడు కావడంతో తన ఏకైక కుమార్తెను ఆయనకిచ్చి వివాహం జరిపించాడు.ఆ తరవాత తన రాజ్యాన్నికూడా ఆయనకు అప్పగించి, వానప్రస్థాశ్రమం స్వీకరించి అడవికి వెళ్ళిపోయాడు.

"అంటే, ఆనాటి రాజులు రాజ్య సంపదల కన్నా, నీతీ నిజాయితీలకూ, సత్యానికీ ఎక్కువ విలువనిచ్చారన్నమాట!" అన్నాడు రాము.

"అవును. అంతేకాదు. కొందరైతే పెద్దల ఆగ్రహానికి గురైనప్పటికీ, సత్యం పలకడానికి వెనుకాడే వారుకాదు. అందుకు హరితస్వుడినే ఉదాహరణగా చెప్పవచ్చు!" అన్నాడు దేవనాథుడు.

"అలాగా! ఆయన గురించి కూడా చెప్పండి తాతయ్యా!" అన్నది శ్యామల.

దేవనాథుడు చెప్పడం ప్రారంభించాడు: హరితస్వ మహారాజు గొప్ప పాలనాదక్షుడేకాదు; అద్భుతమైన గాయకుడు కూడా. బహుశా ఆయనకు సాటిరాగల గాయకుడు ఆ కాలంలో లేడు.ఆయన ఒక నాడు తన ఉద్యానవనంలో పాటపాడుతూ ఉండగా, నారదముని అటుగా వచ్చి ఆ పాట విని ముగ్ధుడయ్యాడు. ఆ సంగతి ఆయన బ్రహ్మదేవుడికీ, సరస్వతికీ తెలియజేశాడు. వారుకూడా హరితస్వుడి గానం వినాలన్నారు. నారదుడు అందుకు ఏర్పాటు చేశాడు.

రాజు బ్రహ్మలోకానికి వెళ్ళాడు. బ్రహ్మ ఆయనతో, "లోకాలన్నిటినీ రక్షించే మహావిష్ణువు, సదా సర్వవేళలా ఆ పనిలోనే నిమగ్నుడైపోయి నిద్ర లేకుండా ఉన్నాడు. నీ గానంతో ఆయన్ను మైమరపించి నిద్రపుచ్చగలవా?" అన్నాడు.

"ప్రయత్నించి చూస్తాను, దేవా!" అన్నాడు రాజు వినయంగా.

ఆయన పాట వినడానికి బ్రహ్మ, మహావిష్ణువును ఆహ్వానించాడు. రాజు అద్భుత గీతాలాపనకు ముగ్ధుడైన మహావిష్ణువు తన్మయత్వంతో నిద్రలోకి జారుకున్నాడు. దానిని చూసి పరమానందం చెందిన బ్రహ్మ రాజుతో, "నీ గాన ప్రతిభ అమోఘం! నీకు కావలసిన వరం ఏదైనా కోరుకో,

ఇస్తాను,'' అన్నాడు. ''సంగీతానికి మూలపురుషుడైన పరమేశ్వరుడి గానం వినాలి. అదే నా కోరిక. నా కోరికలో అపరాధం ఉంటే క్షమించండి,'' అన్నాడు రాజు.

''అలాగే!'' అని బ్రహ్మ, ఆయన కోరికను గురించి శివుడికి చెప్పాడు. శివుడు అందుకు అంగీకరించాడు. పరమశివుడి గానాన్ని వినడానికి దేవతలందరూ ఒకచోట గుమికూడారు.

పరమశివుడు శంకరాభరణ రాగాన్ని ఆలపించాడు.

దేవతలందరూ పరమానందం చెందారు. శంకరుడి రాగాలాపన పూర్తయ్యాక కూడా హరితస్వుడు కదలా మెదలక అలాగే కూర్చుండిపోయాడు.

బ్రహ్మ ఆయన్ను పిలిచాడు. ఆయన ఉలిక్కిపడి, ''ఇంకా గీతాలాపన కొనసాగుతున్నదనే అనుకున్నాను. అప్పుడే అయిపోయిందా?'' అని అడిగాడు ఆశ్చర్యంగా.

''పాట ఇంకా పూర్తి కాలేదని అనుకోవడానికి కారణం ఏమిటి?'' అని అడిగాడు బ్రహ్మ.

''శంకరాభరణ రాగం ఆలపించేప్పుడు గాయకుడు పరిపూర్ణ ప్రశాంత చిత్తంతో ఉండాలి. అయితే ....'' అని ఆగాడు రాజు.

ఆ మాట విని అందరూ దిగ్భ్రాంతి చెందారు. శివుడు పరిపూర్ణ ప్రశాంత చిత్తంతోలేడనేకదా రాజు సూచిస్తున్నది!

శివుడు మూడవనేత్రం తెరిచాడు. తన గానాలాపనను విమర్శించి, తనకు క్లేశం కలిగించిన రాజును భస్మం చేయగలడనే అందరూ అనుకున్నారు. అయితే, అలా జరగలేదు.

రాజు సత్యవచనానికీ, ధైర్యానికీ సంతసించిన పరమశివుడు ఆయన్ను కరుణించాడు. మంద హాసం చేస్తూన్న శివుడికి రాజు నమస్కారం చేశాడు.

''నిజమే! బ్రహ్మ కోరిక ప్రకారం, నేను ఆ రాగాన్ని ఆలపిస్తూన్నప్పుడు కేవలం మానవమాత్రుడైన ఈ రాజుకు నా గానాన్ని ఆస్వాదించగల శక్తి ఉన్నదా అన్న అనుమానం నాలో క్షణకాలం కలిగింది.

ఆ చాంచల్యం కారణంగా రాగాలాపనకు కావలసిన పరిపూర్ణ ప్రశాంత చిత్తం లిప్తపాటు లోపించిన మాట వాస్తవమే!'' అని పరమశివుడు దేవతలకు వివరించాడు.

పరమేశ్వరుడి ఫాలనేత్రం నుంచి వెలువడిన అగ్నిచేత పునీతుడైన కారణంగా, హరితస్వ మహారాజు అత్యంత శక్తిసంపన్నుడుగా పరిణమించాడు. ఉత్తరోత్తరా దేవేంద్రుణ్ణి సైతం చెరసాలలో బంధించిన అంధకాసురుడనే భీకర రాక్షసుణ్ణి అవలీలగా వధించాడు. --(ఇంకావుంది)



# ఈ నెలలో జన్మించిన ప్రముఖులు

చలనచిత్రాలంటే ఇష్టం లేనివాళ్ళు ఎవరుంటారు? అయితే మనలో చాలామంది సినిమాలు చూసి ఆనందిస్తాం. సత్యజిత్‌రాయ్ మంచి సినిమాలు తీయడం ద్వారా సినిమాల పట్ల తనకున్న అభిమానాన్ని వ్యక్తం చేశాడు. ఉత్తమ దర్శకుడుగా ప్రపంచ ప్రసిద్ధిగాంచిన రాయ్-ప్రపంచ చలనచిత్రరంగంలో భారతీయ చలన చిత్రాలకు సముచిత స్థానం కల్పించడానికి కృషి చేశాడు. ఆయనకెన్నో అవార్డులు వచ్చాయి. ఆ అవార్డులకన్నిటికీ మకుటాయమానంగా ఆయన జీవితంలో చలన చిత్రరంగంలో సాధించిన దానికి గుర్తింపుగా 1992 ఆస్కార్ అవార్డ్ 'లైఫ్ టైమ్ అచీవ్‌మెంట్'కు లభించింది.

సత్యజిత్‌రాయ్ 1921 మే 2 1వ తేదీ కలకత్తాలో జన్మించాడు. కళల పట్లా, సినిమాల పట్లా ఆయన బాల్యంలోనే ఆకర్షితుడయ్యాడు. నిజానికి ఇది ఆయన కుటుంబంలోనే ఉన్నది. వారి తాతగారు ఉపేంద్ర కిశోర్ రచయిత, ప్రచురణకర్త. ఆయన తండ్రి సుకుమార్ రాయ్ బెంగాలీలో సుప్రసిద్ధ రచయిత, కవి.

సత్యజిత్ రాయ్ బహుముఖ ప్రజ్ఞావంతుడు. సినిమా దర్శకుడుగా, చిత్రకారుడుగా, సంగీత దర్శకుడుగా, రచయితగా, సంపాదకుడుగా, ఛాయాగ్రాహకుడుగా, కవిగా, మేధావిగా అందరి దృష్టినీ ఆకర్షించాడు. చేపట్టిన ప్రతి ప్రక్రియలోనూ తన అసమాన ప్రజ్ఞాపాటవాలను ప్రదర్శించాడు.

ఆర్థిక శాస్త్రంలో పట్టభద్రుడైన సత్యజిత్‌రాయ్ 1941లో శాంతినికేతన్‌లో లలిత కళలను, చిత్ర కళనూ అభ్యసించాడు.

1943లో ఒక అడ్వర్‌టైజింగ్ కంపెనీలో ఉద్యోగిగా చేరాడు. అయినా ఆయన దృష్టి మాత్రం ఎప్పుడూ చలనచిత్రాల మీదే ఉండేది. 1950లో ఆయన పనిచేసే కంపెనీ యజమానులు ఆయన్ను లండన్‌కు పంపారు. అక్కడున్న ఐదు నెలలలో రాయ్ 100 సినిమాలు చూశాడు. ఇటాలియన్ సినిమా 'బైసికిల్ తీఫ్' ఆయన్ను ఎంతగానో ప్రభావితం చేసింది. ఆ చిత్రమే ఆయనకు చిత్రనిర్మాణానికి స్ఫూర్తినిచ్చింది.

'పథేర్ పాంచాలీ' చిత్రనిర్మాణంతో రాయ్ చలన చిత్ర యాత్ర ఆరంభమయింది. ఆ చిత్రం 1956 కేన్స్ ఫిలిం ఫెస్టివల్‌లో 'ఉత్తమ మానవతా చిత్రణ' అవార్డు అందుకున్నది. నాలుగు బాలల చిత్రాలతో సహా ఆయన 30 చిత్రాలు తీశాడు. అపరాజిత (1956) అపూర్ సంసార్ (1959) చారులత (1964) సత్రంజ్ కీ ఖిలాడీ (1977) ఆగంతక్ (1991) మొదలైన చిత్రాలు అభిమానుల విశేష ప్రశంసలను అందుకున్నాయి.



సత్యజిత్ రాయ్

మాలిక్‌దా అని స్నేహితులూ, సన్నిహితులూ, ఆప్యాయంగా పిలిచే సత్యజిత్‌రాయ్‌కి-మానవ మనస్తత్వం గురించీ, మనిషిపై పరిస్థితుల ప్రభావం గురించీ ప్రగాఢమైన అవగాహన ఉండేది. ఆయన బాలల కోసం ప్రత్యేకంగా-గూపీ గైనే బాఘా బైనే; హీరాక్ రాజర్ దేశ్ అనే రెండు అద్భుతమైన సంగీత ప్రధాన చిత్రాలు రూపొందించాడు.

రచయితగా, కార్టూనిస్టుగా కూడా ఆయనకు మంచి పేరున్నది. వారి తాతగారు నడిపిన 'సందేశ్' అనే పిల్లల పత్రికను రాయ్ 1961లో పునఃప్రారంభించాడు. అందులో ఆయన కథలూ, చిత్రాలూ వెలువడ్డాయి.

భారత ప్రభుత్వం 1992లో ఆయన్ను 'భారత రత్న' అవార్డుతో సత్కరించింది. అదే సంవత్సరం ఏప్రిల్‌లో ఆయన కీర్తిశేషుడయ్యాడు. ఆయన పేరు వినగానే చలనచిత్ర అభిమానుల హృదయాల్లో ఆశ్చర్యానందాలు కలుగుతూనే ఉంటాయి. మంచి అభిరుచిగల చలన చిత్ర అభిమానులు ఉన్నంత కాలం ఆయన కీర్తి నిలిచి ఉంటుంది.

# అద్భుత భారత వినోదయాత్ర

ప్రియమైన మిత్రులారా!

ఉదయకుమార్, అరుణ చాలా అదృష్టవంతులైన పిల్లలు. ఈ వేసవి సెలవుల్లో భారత వినోదయాత్రకు బయలుదేరుతూ, వాళ్ళు మిమ్మల్నీ తమతో రమ్మని ఆహ్వానిస్తున్నారు.

ఈ చందమామ సంచిక మిమ్మల్ని వాళ్ళతో పాటు, అద్భుత భారత వినోదయాత్రకు తీసుకువెళుతున్నది. సుప్రసిద్ధ పర్యాటక కేంద్రాలతోపాటు, అంతగా ప్రాచుర్యం పొందని స్థలాలను కూడా మీరు సందర్శించి, అక్కడి వింతలనూ, విశేషాలనూ, ఆచార వ్యవహారాలనూ, సంప్రదాయాలనూ తెలుసుకోవచ్చు. మీ మెదడుకు పని కల్పించడంకోసం మీరు పాల్గొనడానికి వీలుగా కొన్ని శీర్షికలను ఇందులో పొందుపరుస్తున్నాము. ఇవన్నీ మిమ్మల్ని అలరించగలవని ఆశిస్తున్నాము.

వీటిని గురించి మీ అభిప్రాయాలేమిటో రాస్తారు కదూ?

శుభాకాంక్షలతో,

Viswam

విశ్వం



"ఆహా!" అంటూ ఎగురుతూ వచ్చింది అరుణ. "ఇదిగో వచ్చేశాను!" అంటూ ఉదయకుమార్ అక్కడికి వచ్చాడు. ఇద్దరూ కలిసి ఉత్సాహంగా తండ్రి దగ్గరికి వెళ్ళి తమ ప్రోగ్రెస్ రిపోర్టులు చూపారు. ఇద్దరూ వాళ్ళ వాళ్ళ తరగతుల్లో ఫస్టు మార్కుల తెచ్చుకున్నారు. "చాలా సంతోషం! మన ఒప్పందంలో మీరు మీ మాట నిలబెట్టుకున్నారు. ఇక నేను నా మాట నిలబెట్టుకుంటాను," అన్నాడు వాళ్ళ నాన్న.



పరీక్షల్లో మంచి మార్కులు తెచ్చుకున్నట్టయితే, సెలవుల్లో మన దేశంలోని పర్యాటక కేంద్రాలకు తీసుకువెళతానని వాళ్ళ నాన్న వాళ్ళకు ఎప్పుడో మాట ఇచ్చాడు. వాళ్ళు క్లాసు ఫస్టు వచ్చారు ఇప్పుడు ఆయన సంగతే మిగిలింది.

మరికొన్ని రోజులు వాళ్ళు దేశపటాన్ని ముందు వేసుక్కూర్చుని, ఎక్కడెక్కడికి, ఎప్పుడెప్పుడు ఎలా ఎలా వెళ్ళాలో పథకం వేసుకున్నారు. ఆ తరవాత టికెట్లు బుక్ చేసుకున్నారు. సీట్లు రిజర్వు చేసుకున్నారు. రైలు, విమానం, బస్సు, కారు



ఇంకా ఎడ్లబండిలో కూడా వాళ్ళు ప్రయాణం చేయవలసి ఉన్నది. కొన్ని రోజులు హోటళ్ళలో దిగవలసి ఉంటుంది. మరికొన్ని రోజులు ఆరుబయటే అంటే చుక్కలు మెరిసే ఆకాశం కిందే గడపవలసిఉంటుంది!



## ప్రయాణానికి తీసుకోవలసిన జాగ్రత్తలు

ఏమిటీ! అప్పుడే మీరందరూ ప్రయాణానికి సిద్ధమైపోయారా? అయితే, ఒక్కసారి ఈ విషయాలను సరిచూసుకోండి!

- రిజర్వేషన్‌కు సంబంధించిన పేపర్లన్నీ తీసుకున్నారో లేదో ఒకటికి రెండుసార్లు సరిచూసుకోండి.
- ఎక్కువ లగేజీ వద్దు. అవసరమైన వస్తువులనూ, దుస్తులనూ మాత్రమే తీసుకోండి.
- డబ్బు కన్నా ట్రావెలర్స్ చెక్స్, క్రెడిట్ కార్డులు తీసుకువెళ్ళడం మంచిది.
- ముఖ్యమైన మందులూ, ఫస్ట్ ఎయిడ్ కిట్ తీసుకువెళ్ళడం మరిచిపోకండి.
- సన్‌గ్లాస్, లోషన్లు, సబ్బులు తీసుకువెళ్ళాలి.
- ట్రెక్కింగ్ చేయాలనుకుంటే ఫస్ట్ ఎయిడ్ బాక్స్‌తోపాటు, వాటర్ బ్యాగ్, స్నాక్స్, జత బట్టలు, టార్చ్‌లైట్, స్పేర్ బ్యాటరీలు, టెంట్ చాలా అవసరం. బైనాక్యులర్స్, కెమెరా, ఫిల్మ్ రోల్స్ మరిచిపోకండి.

అంతా రెడీ కదా! ఇక బయలుదేరండి మరి!









ఆ కాలంలో మనదేశంలో సంస్థానాధిపతులు చాలామంది సొంతంగా రైళ్ళు నడుపుకునే వాళ్ళు. పాలకులకు కావలసిన సకల వసతులను, సౌకర్యాలను రైలు పెట్టెలలో ఏర్పాటు చేసుకునేవాళ్ళు. బరోడా గేక్వాడ్ రైలు పెట్టెలో సింహాసనాన్ని అమర్చుకున్నాడు!

అన్నా చెల్లెలూ, అమ్మా నాన్నలూ ఆఖరికి బయలుదేరారు. అన్నా చెల్లెళ్ళ ఉత్సాహం అమ్మా నాన్నలకు నవ్వు తెప్పించింది. నలుగురూ ముంబాయి విక్టోరియా టెర్మినస్‌లో రైలు ఎక్కారు. ''రైలంటే కొత్తగా ఉండాలి కదా! మరి ఈ రైలేమిటి ఇంత పాత వాసన వేస్తోంది, ఈ పెట్టె మరీ ఘోరం!'' అంటూ అరుణ బుల్లి వేళ్ళతో ముక్కు మూసుకున్నది. ''అవునవును, భారత రైల్వే మరీ పాతది కదా! అందువల్లే ఈ వాసన!'' నాన్న నవ్వుతూ మళ్ళీ ఇలా అన్నాడు: ''మన దేశంలో రైలును ప్రవేశ పెట్టింది బ్రిటిష్ వాళ్ళు. మొట్ట మొదటి రైలు బొంబాయి నుంచి థానాకు నడిచింది. 1853 ఏప్రిల్ 16వ తేదీ అది బొంబాయి నుంచి బయలుదేరింది. ఆ రోజు ఎంత హంగామా అనుకున్నారు? ప్రభుత్వం సెలవు ప్రకటించింది. 400 మంది ప్రయాణీకులతో బయలుదేరిన రైలుకు వీడ్కోలు పలకడానికి ప్రజలు అమితోత్సాహంతో గుమికూడారు. గవర్నర్ బ్యాండ్ వాయిద్యం; 21 గన్ల సెల్యూట్‌తో రైలు బొంబాయి నుంచి కదిలింది.

''ఆహాహా, అక్కడ చూడండి!'' అంటూ రైలు పెట్టెలోకి జొరబడడానికి గొలుసుతో ముందుకు ఉరుకుతున్న అల్సేషన్ కుక్కకేసి చుస్తూ ఎగిరి గంతేసింది అరుణ. ''కుక్క కోసం అలా ఆరాటపడతావెందుకు? ఫస్ట్ క్లాస్ పెట్టెలో పయనం చేస్తున్నట్ట యితే నీ పెంపుడు కుక్కను కూడా నీతో తీసుకువెళ్ళవచ్చు. అయితే, అందుకోసం ప్రత్యేకంగా రెండు పడకల పెట్టెనుగానీ, నాలుగు పడకల పెట్టెనుగానీ మొత్తంగా రిజర్వు చేసుకుని, అదనంగా ఉన్న లగేజీకి మరింత చెల్లించవలసి ఉంటుంది,'' అన్నది అరుణ తల్లి నవ్వుతూ.



తొలి మజిలీ అందాల గుజరాత్. పిల్లలు అహ్మదాబాదులోని 'పతంగ్ మ్యూజియం'కు వెళ్ళారు. గాలిపటాల ప్రియుడైన ఉదయకుమార్‌కు దానిని చూడగానే అమితానందం కలిగింది.



ఒకేచోట వెయ్యికి పైగా గాలిపటాలు! ఆశ్చర్యంతో ఉదయ్‌కు నోట మాట రాలేదు. ప్రపంచంలోవున్న రెండు అతి పెద్ద కైట్ (గాలిపటాల) మ్యూజియాలలో ఇది ఒకటి. రెండవ మ్యూజియం టోక్యోలో ఉన్నది. ఇక్కడ ప్రదర్శనకు ఉంచిన గాలిపటాలలో ఒకటి 450 కాగితం



ముక్కలతో తయారు చేయబడింది.

రాజస్థాన్‌లో వాళ్ళకు మరొక అపూర్వ అనుభవం. జయపూర్‌కు చేరగానే జంతర్ మంతర్ అబ్సర్వేటరీని చూడడానికి వెళ్ళారు. జయపూర్ నగరాన్ని నిర్మించిన రెండవ సవాయ్ జయ్‌సింగ్ ఈ అబ్సర్వేటరీని రూపొందించాడు. జయ్‌సింగ్ సమర్థవంతుడైన పరిపాలనాదక్షుడు మాత్రమే కాదు; అంతరిక్ష విజ్ఞానం పట్ల అమితాసక్తి కలిగినవాడు. స్థానిక సమయాన్ని కొలవడానికీ, సూర్య చంద్ర గ్రహణాలను నిర్ణయించడానికీ, పరిశీలించడానికీ ఈ అబ్సర్వేటరీని ఆయన ఉపయోగించాడు. "దేన్నయినా గట్టిగా పట్టుకోండి! గాలికి కొట్టుకుపోగలరు!" అంటూ ఉన్నట్టుండి హెచ్చరించింది, ఉదయ్ తల్లి. పిల్లలిద్దరూ హవా మహల్ గోడలను గట్టిగా పట్టుకున్నారు. దానిని చూసి ఆమె పకపకా నవ్వింది. పిల్లలు కొంత సేపటికి తేరుకుని, "ఏం గాలి! ఏం గాలి!" అంటూ ఆశ్చర్యపడసాగారు. హవా మహల్ అంటే 'వాయు భవనం' అని అర్థం. ఈ ఐదంతస్థుల భవనంలో 953 చిన్న చిన్న గవాక్షాలున్నాయి. వాటి గుండా ఈ భవన మంతా ఎల్లప్పుడూ చల్లని గాలి వీచే విధంగా భవననిర్మాణం జరిగింది.








''మనంఇప్పుడొకపవిత్రస్థలంలోఅడుగు పెడుతున్నాం,'' అంటూ కొంగును తల మీదికి తీసుకున్నది తల్లి.''అల్లరి చేయకూడదు. గట్టిగానూ మాట్లాడకూడదు,'' అని ఆమె మళ్ళీ హెచ్చరించింది. అయితే ఆమె హెచ్చరిక అవసరం లేకుండానే, అమృత సర్ స్వర్ణదేవాలయంలో అడుగుపెట్టగానే పిల్లలిద్దరూ కిక్కురుమనకుండా ఉండిపోయారు.అక్కడి వాతావరణం అంతటి ప్రశాంత గంభీరంగా ఉన్నది.

''మనదేశంలోని మతసామరస్యానికి ప్రత్యక్ష నిదర్శనం ఈ స్వర్ణదేవాలయం. ఈ దేవాలయ నిర్మాణానికి కావలసిన స్థలాన్ని అక్బర్ చక్రవర్తి ఇచ్చాడు. 1577లో గురు రామదాసు, పునాదుల తవ్వకం పనులు ప్రారంభించాడు. 1589లో ఈ ఆలయ నిర్మాణానికి మియాన్ మీర్ అనే ఒక ముస్లిం సాధువు ప్రారంభోత్సవం చేశాడు,''అంటూ ఆ ఆలయ విశిష్టతను వివరించాడు తండ్రి నెమ్మదిగా. శిక్కుల పవిత్ర గ్రంథం 'గ్రంథ్ సాహెబ్' భద్ర పరచిన పెద్ద పేటికవున్న మందిరాన్ని చేరారు. కొందరు భక్తులు అందులోని భక్తి గీతాలను శ్రావ్యంగా ఆలపిస్తున్నారు. తండ్రి కరసేవ చేయాలనుకున్నాడు. పిల్లలు కూడా ఆయనతో జతకలిశారు.

పిల్లలు ఓరగా ఉన్న చీపురు కట్టలను అందుకుని-మరికొందరు భక్తులతో కలిసి ఆలయం నేలను చిమ్మారు. వాళ్ళ నాన్న మరోవైపు వరసగా అమర్చివున్న భక్తుల పాదుకలను తుడిచాడు. తల్లి అక్కడున్న పెద్ద సామూహిక వంటశాలకు వెళ్ళి అక్కడి వాళ్ళకు సాయపడింది. సేవా కార్యక్రమం అయ్యాక అందరూ కలిసి ఆలయంలో జరిగే సామూహిక విందుకు కూర్చున్నారు. రొట్టెలు, సబ్జీ, పప్పుతో రుచికరమైన భోజనం పూర్తి చేశారు.





దీనికోసమే పిల్లలు ఆతృతతో ఎదురుచూస్తున్నారు. ఉత్తర భారత దేశంలో ఉన్న వన్యమృగ సంరక్షణాకేంద్రాలనూ, జాతీయోద్యానాలనూ సందర్శించాలన్నదే వాళ్ళ కోరిక. ''జంతు ప్రదర్శన శాలలు వద్దు. మనం తిన్నగా అడవులలోకే వెళ్ళి వన్య మృగాలను ప్రకృతి సహజ పరిసరాలలోనే చూడాలి!'' అన్నాడు ఉదయ్. ఉత్తర భారతదేశంలోవున్న ప్రధానమైన అయిదు వన్య మృగ సంరక్షణా ప్రాంతాలకు వాళ్ళు వెళ్ళారు. వాళ్ళు వెళ్ళిన మార్గం ఏదో కనుగొనగలరేమో ప్రయత్నించి చూడండి!









ఏప్రిల్-జూన్ నెలల మధ్య కులూలోయ సమీపంలోవున్న గ్రేట్ హిమాలయన్ నేషనల్ పార్కును సందర్శించవచ్చు. మంచు చిరుతలు, కొండమేకలు, యాక్‌లు, ఊదా నలుపు ఎలుగుబంట్లు ఇక్కడి ప్రత్యేక ఆకర్షణలు.



సివాలిక్ కొండసానువుల పాదతలంలో కార్బెట్ నేషనల్ పార్క్ ఉన్నది. సుప్రసిద్ధ బ్రిటిష్ వేటగాడూ, ప్రకృతి పరిశీలకుడూ అయిన జిమ్ కార్బెట్ స్మృతి చిహ్నంగా దీనికీపేరు పెట్టారు. ఫిబ్రవరి– మే నెలల మధ్య ఇక్కడికి వెళ్ళవచ్చు. పులులు, ఏనుగులు, చిరుతలు, ఎలుగుబంట్లు, నిల్‌గాయ్, కణుజులు, అడవి పందులు, ముండ్ల పందులు, నాలుగు కొమ్ముల జింకలు మొదలైన జంతువులు సందర్శకులను అలరిస్తాయి.



హిమాలయాల పాదతలంలోని 'దుద్వా నేషనల్ పార్క్' స్వాంప్ డీర్ (జింక), పరిరక్షణకు నెలకొల్పబడింది. క్రమంగా ఇక్కడ పులులు, చిరుతపులులు, లెపర్డ్ జాతి చిరుతపులులు ప్రవేశపెట్టబడ్డాయి. ఇటీవల ఖడ్గమృగాలను కూడా చేర్చారు. ఈ 'పార్క్'లో రకరకాల పక్షులు కూడా ఉన్నాయి.



బాంధవ్ నగర్ నేషనల్ పార్కులో పులులు, చిరుత పులులు, గోర్, చిటాల్, నిల్‌గాయ్, కణుజులు మొదలైన జంతువులతో పాటు రకరకాల పక్షులనుకూడా చూడవచ్చు. ఫిబ్రవరి – జూన్ నెలల మధ్య కాలం దీనిని సందర్శించడానికి అనుకూలమైన సమయం.



1973లో పాలమావ్ నేషనల్ పార్కును 'ప్రాజెక్ట్ టైగర్' పథకం కిందికి తీసుకువచ్చారు. హథీ బజ్వా, మధుచన్ శిఖరాలపై నుంచి జంతువులను చూసి ఆనందించవచ్చు. అక్టోబర్ –మే నెలల మధ్య ఇక్కడికి వెళ్ళినట్టయితే వాతావరణం అనుకూలంగానూ, ఆహ్లాదకరంగానూ ఉంటుంది.





ఉదయ్ బస్సులోంచి కిందికి ఉరికాడు. అంతకు ముందే బస్సునుంచి దిగిన అరుణ చుట్టు పక్కల ఆసక్తితో కలయ చూస్తోంది. వాళ్ళెక్కడున్నారో తెలుసా? ఇదిగో ఒక క్లూ: బీహార్ రాష్ట్రంలో ఇదొక పవిత్ర క్షేత్రం. అంతలో ఉదయ్, అరుణ చెప్పినట్టు చుక్కల గళ్ళకు రంగు వేసి ఈ క్షేత్రంతో సంబంధం ఉన్న మహనీయుడి చిత్రపటం గీశాడు. పైనున్న గళ్ళకు రంగులు వేశారంటే మీరూ ఆయన బొమ్మను చూడవచ్చు. అంతే. ఆ తరవాత వాళ్ళిప్పుడు ఏ ప్రాంతం చేరుకున్నారో మీకే తెలిసిపోతుంది!

## పురాతన క్షేత్రం నుంచి ఆధునిక పారిశ్రామికాభివృద్ధికి!

వాళ్ళు పారిశ్రామిక నగరాల గుండా ప్రయాణం చేశారు. అయితే, ఆ ఉక్కు నగరాల పేర్లలోని అక్షరాలు కాస్తా గజిబిజిగా తారుమారయ్యాయి. వాటిని మీరు సరిదిద్దగలరేమో చూడండి:



సమాధానాలు

రంగువేయండి: గౌతమ బుద్ధుడు జ్ఞానం పొందిన బుద్ధగయ.

ఉక్కు నగరాల గజిబిజి:

1. బొకారో 2. జెంషెడ్ పూర్ 3. దుర్గాపూర్

4. భిలాయ్

5. రూర్కెలా





కోల్‌కతలో అదే వాళ్ళకు తొలిరోజు. ఎండ విపరీతంగా బాదేస్తోంది. చెమటలు పోస్తున్నాయి. ఉదయ్, అరుణ చెప్పలేని దాహానికి గురయ్యారు. బాగా అలిసిపోయారు. సరిగ్గా ఆ సమయానికి వాళ్ళ నాన్నగారి మిత్రుడు చటర్జీ అక్కడికి వచ్చి, ''నాతో రండి. మిమ్మల్ని ఒక చోటికి తీసుకువెళతాను. అక్కడ ఈ ప్రాంతానికే ప్రత్యేకమైన స్వీట్స్ లభిస్తాయి. అవి తింటే మీకు కాస్త బలం వస్తుంది!'' అన్నాడు. అన్నాచెల్లెళ్ళు ఆయన వెంట బయలుదేరారు. చటర్జీ వెంట నడుస్తూ, ''మీరు చెప్పింది రసగుల్లాల గురించే కదా అంకుల్?'' అన్నది అరుణ.



''అవును, రసగుల్లాలే. ఇంకా రాజ్‌భోగ్, రసమలాయ్, ఖీర్ మోహన్, చమ్ చమ్, మిష్టీ దోయ్...''అంటూ చటర్జీ ఇంకా పూర్తి చేయకముందే,''బెంగాలీ స్వీట్స్ ఇన్ని ఉన్నాయా?''అన్నాడు ఉదయ్. అలా చెప్పేటప్పుడు అతడి కళ్ళు ఆశ్చర్యంతో రసగుల్లాల్లా పెద్దవయ్యాయి.






పాలకోవా, రవ్వ కలిపి చేసిన ఉండలను వేయించి, చక్కెర పాకంలో నానబెట్టి లెడికేనీ తయారు చేస్తారు. బ్రిటిష్ వైస్రాయి భార్య లేడీ కానింగ్ గౌరవార్థం దానికాపేరు పెట్టారు. లేడీ కానింగ్ కాస్తా లెడికేనీ అయింది!

మిష్టీదోయ్ కావాలా?



ఈశాన్య భారతదేశం అనగానే మనకు అందమైన కొండలూ, కోనలూ; చల్లటి వాతావరణం; విస్తారమైన టీ తోటలు; మృదువైన సంగీతం; లయబద్ధమైన జానపద నృత్యాలు గుర్తుకు వస్తాయి. పిల్లలు కూడా అక్కడికి వెళ్ళారు. వాళ్ళు ఏఏ ప్రదేశాలకు వెళ్ళారో మీకు తెలుసుకోవాలని వుందికదూ? ఈ ప్రశ్నలకు సమాధానాలు చెప్పగలరేమో ఆలోచించి చూడండి. వాళ్ళు వెళ్ళిన ప్రాంతాలు మీకు తెలుస్తాయి.



1. సంఘాయ్ జింకలు విచ్చలవిడిగా ఆడుకునే ప్రాంతం ఏది?

   ....................................

2. నాట్యానికి నేపథ్య సంగీతం వెదురుబొంగులతో ఎక్కడ సమకూరుస్తారు?

   ....................................

3. ప్రపంచంలోనే నది మధ్య వున్న అతి పెద్ద ద్వీపం ఏది?

   ....................................

4. ఆసియాలో కెల్లా అతి పెద్ద టీ తోట ఎక్కడ వున్నది?

   ....................................

5. చైనా నుంచి వచ్చే బ్రహ్మపుత్ర భారత భూభాగంలో ప్రవేశించే ప్రదేశం ఏది?

   ....................................

6. ఆసియాలో కెల్లా అతిపెద్ద బౌద్ధవిహార్ ఎక్కడ ఉన్నది? ఇక్కడే ఆరవ దలైలామా జన్మించాడు.

   ....................................

7. వర్షం, వర్షం, ఎప్పుడు చూసినా వర్షమే. అత్యధిక వర్షపాతం కలిగిన ప్రాంతం ఏది?

   ....................................

8. చల్లటి గాలులతో హాయిని కలిగించే మేఘాలయలోని వేసవి విడిది ఏది?

   ....................................



9. అరుదైన ఒంటికొమ్ము ఖడ్గమృగాలు విచ్చలవిడిగా తిరుగాడే ప్రాంతం ఏది?

   ....................................

మీకు సరైన సమాధానాలు తెలియలేదంటే పేజీని తలకిందులుగా తిప్పిచూడండి!

సమాధానాలు

1. కీయ్‌బుల్లాంజావో
2. ఐజ్వాల్
3. ముజులీ ద్వీప్
4. మోనాలోరే
5. లోహిత్
6. తవాంగ్
7. చిర్రపుంజి
8. షిల్లాంగ్
9. కజిరంగా






ఉదయ్‌కుమార్, అరుణ ఇద్దరూ భరతనాట్యం నేర్చుకుంటున్నారు. అందువల్ల వారికి ఉత్తర ప్రాంతంలో ఉన్న మరిన్ని సుప్రసిద్ధ నాట్యాలను చూపించాలని వాళ్ళ నాన్న ఆశించాడు. ఒక జానపద నృత్య ప్రదర్శనను చూశాక, "ఆ నాట్యం నేనూ నేర్చుకుంటాను," అన్నాడు ఉదయ్.



మణిపూర్‌లో వాళ్ళు అందమైన మణిపురి శాస్త్రీయ నృత్యాన్ని చూశారు. నాట్యకారులు శ్రీకృష్ణలీలలు ప్రదర్శించారు. చిన్న చిన్న అద్దాలు అమర్చిన రంగు రంగుల దుస్తులు,పలుచటి వస్త్రాల మేలిముసుగులు ఈ నాట్యానికి మరింత ఆకర్షణను సమకూర్చాయి.

భువనేశ్వర్‌లో వాళ్ళు ఉత్తేజ పూరితమైన ఒడిస్సీ నాట్యాన్ని చూశారు. ఒడిస్సీని భారతదేశంలో అతి ప్రాచీనమైన శాస్త్రీయ నాట్యంగా పురాతత్వవేత్తలు భావిస్తున్నారు. ఒరిస్సాలోని రాణి గుంఫా గుహలలో ఒడిస్సీ నాట్యభంగిమలలో కొన్ని గుహాశిల్పాలు బయట పడ్డాయి. అవి క్రీ.పూ. 200 నాటికి చెందినవి.

ఆ తరవాత వాళ్ళు రెండు రకాల 'ఛావ్' నృత్యం చూశారు. ఉదయ్‌కి అది ఎంతో నచ్చింది.

తూర్పు భారతదేశంలో అత్యంత ప్రాచుర్యం పొందిన జానపద నృత్యం 'ఛావ్!' వంగడానికీ, గెంతడానికీ, దూకడానికీ, గిరికీలు కొట్టడానికీ వీలుగా శరీరాన్ని క్రమశిక్షణలో ఉంచుకోవడానికి అనుకూలంగా కొన్ని ప్రత్యేక వ్యాయామాలు నేర్చుకుంటారు. రామాయణ, మహాభారత ఘట్టాలను నాట్యాలుగా ప్రదర్శిస్తారు. పశ్చిమ బెంగాల్‌కు చెందిన పురీలియా ఛావ్ చాలా శక్తివంతమైనది. కాగితాలూ, బట్టలూ, బంకమన్నూ మొదలైన వాటితో తయారు చేసిన తొడుగులు ముఖాలకు ధరించి ఆరేడుగురు పురుషులు ఈ నృత్యం చేస్తారు.

బీహారుకు చెందిన మయూర్ భంజ్ ఛావ్ చైత్రోత్సవాల సందర్భంగా సంప్రదాయానుసారం ప్రదర్శిస్తారు. కొన్ని యుద్ధ విద్యలతో పాటు అందమైన నాట్య భంగిమలూ, పాదాల కదలికలూ మిళితమైన నృత్య నాటికలు ఇవి!





ఒరిస్సాలోని సంభల్‌పూర్ పట్టణం చేరగానే అరుణ తల్లి దాపులనున్న బ్రహ్మాండమైన ఒక చేనేత చీరల దుకాణానికి వెళ్ళింది. ఆ ఊరు చేనేత చీరలకు చాలా ప్రసిద్ధి. అక్కడి చీరలను చూడగానే ఆమె ప్రపంచాన్నే మరిచిపోయింది. ఆ చీరను తియ్, దీనిని చూపు అంటూ చీరల ఎంపిక ప్రారంభించింది. ఒక పట్టాన బయట పడలేకపోయింది. తండ్రీ పిల్లలు ఓర్చుకోల్పోయి, ఆమెను అక్కడే వదిలి వెళ్ళిపోతామని బెదిరించారు. అయినా ఆమె దానినేమీ లెక్కచేయలేదు!

అది ఒక రెండురోజుల పథకం! గోండులు నివసించే ముఖ్యప్రాంతానికి వెళ్ళాలనుకున్నారు. సంభల్‌పూర్ నుంచి చట్టీస్ ఘడ్‌కు జీపులో కొన్ని గంటల ప్రయాణం మాత్రమే. వాళ్ళు అక్కడికి చేరేసరికి వారానికి ఒకరోజు జరిగే సంత జరుగుతున్నది. వందలాది గిరిజనులు గుమిగూడి ఉన్నారు. తేనె,బట్టలు, అగ్గిపెట్టెలు, ఉప్పు, పప్పు, మిరపకాయలు, మాహువా పువ్వులు ఇలా ఒకటేమిటి?చాలా ఉన్నాయి సంతలో.





ఉదయ్, అరుణలు సంతను చుట్టి చూశారు.'' ఏమిటీ వింత పువ్వులు?'' అని అడిగింది అరుణ. ''అవి మాహువా పువ్వులు!'' అని వాటిని గురించి వివరించాడు వాళ్ళకు తోడుగా, వాళ్ళవెంట వచ్చిన అంకుల్ పట్నాయక్.

గోండుల జీవితంలో మాహువా పువ్వులకు ప్రత్యేక స్థానం ఉంది. ఆ పువ్వులనుంచి ఒక విధమైన కల్లు తయారు చేసి, పంటలకోత సమయంలో జరిగే ఉత్సవాలప్పుడు దేవుడికి సమర్పిస్తారు. మాహువా పళ్ళు తింటారు. గింజల నుంచి నూనె తీస్తారు. గోండులు భారతదేశంలో అధిక సంఖ్యలో ఉన్న గిరిజనులు.

చట్టీస్ ఘడ్ ప్రాంతంలో వీళ్ళు అధికంగా ఉన్నారు. చట్టీస్‌ఘడ్ ఇప్పుడు ప్రత్యేక రాష్ట్రంగా ఏర్పడింది. ఒరిస్సా, ఆంధ్రప్రదేశ్‌లు ఇరుగు పొరుగు రాష్ట్రాలు.

అన్నా చెల్లెళ్ళు సంతకు వెళ్ళడమే కాక అక్కడి ఆహారాన్ని రుచి చూశారు. ఉదయ్‌కి అది నచ్చింది. అరుణకు నచ్చలేదు. ఆ సాయంకాలమే సంభల్‌పూర్‌కు తిరుగు ప్రయాణమయ్యారు.



ఆంధ్రప్రదేశ్ రాష్ట్రానికి వచ్చాక, తిరుపతి క్షేత్రాన్ని దర్శించని వాళ్ళుంటూ ఉంటారా? తిరుపతి మనదేశంలోని అతి సంపన్నమైన ఆలయం. దేశం నలుమూలలనుంచీ పేదలు, ధనికులు అన్న భేదం లేకుండా రోజూ భక్తులు దైవదర్శనానికి వస్తూ ఉంటారు. సముద్ర మట్టానికి 840 మీ॥ ఎత్తులో తిరుమల కొండపై ఆలయం వెలుగొందుతున్నది.

''ఏమిటీ, ఎక్కడ చూసినా బోడిగుండ్లుగానే ఉన్నాయి?'' అని అడిగింది అరుణ.

''దక్షిణాదిలో చాలామంది హిందువులకు, తిరుపతికి వస్తే ఇక్కడ తలనీలాలు సమర్పించి దేవుణ్ణి దర్శించడం సంప్రదాయం!'' అన్నది తల్లి.

''అవును, నేనూ ఇప్పుడు నా తలనీలాలు సమర్పిస్తాను,'' అన్నాడు తండ్రి. పిల్లలు పకపకానవ్వారు.తండ్రి నీలాలు ఇచ్చిరాగానే అందరూ కలిసి దైవదర్శనం చేసుకున్నారు. ఆ తరవాత తండ్రి రుచికరమైన పెద్ద పెద్ద తిరుపతి లడ్డూలు తెచ్చిపెట్టాడు.

తరవాత తమిళనాడు తంజావూరులోని బ్రహ్మాండమైన బృహదీశ్వ రాలయాన్ని చూడగానే ఉదయ్ నోట మాటరాలేదు. ''ఆహా! ఎంత పెద్ద దేవాలయం!'' అన్నాడు 66 మీ॥ ఎత్తయిన గోపురం చుట్టూ ప్రదక్షిణం చేస్తూ.

చుట్టుపక్కల అసలు రాయి అంటూ లేని ప్రాంతంలో నల్ల బండలతో నిర్మించబడిన బ్రహ్మాండమైన ఆలయం ఇది.

ఉన్నట్టుండి అరుణ కనిపించలేదు. రద్దీ కూడా అంతగా లేదు. ఆ అల్లరిపిల్ల ఎక్కడికి వెళ్ళిందా అని అందరూ చుట్టుపక్కల వెదకసాగారు. ఆఖరికి ఆలయానికి ముందు కొద్దిదూరంలో ముగ్గులు పెడుతూన్న ఒక స్త్రీ ఎదుట కూర్చుని ఆసక్తిగా చూస్తోంది అరుణ.

''ఇది బియ్యం పిండితో పెట్టే ముగ్గు, పాపా! మొదట లెక్కగా చుక్కలు పెట్టాలి. ఆ తరవాత చుక్కలను కలుపుతూ ముగ్గు వేయాలి,'' అని అరుణ తల్లి కేసి తిరిగి,'' మీ అమ్మాయి స్తంభం మీది శిల్పాలను ఆసక్తిగా చూస్తోంది కదా అని ఈ ముగ్గు వేయడం నేర్పుతున్నాను!'' అన్నది ఆ స్త్రీ.

ఇదిగో ఆమె వేసిన ముగ్గు ఇక్కడే ఉంది. ఇది వేయడం చాలా సులభం. మీరూ వేయగలరేమో ప్రయత్నించండి.

ఆంటీ!
నేను వేస్తాను,
చూస్తారా.

అందరూ కేరళ రాష్ట్రం కొచ్చిన్ చేరారు. తండ్రి వాళ్ళను సెయింట్ ఫ్రాన్సిస్ చర్చికి తీసుకువెళ్ళాడు. భారతదేశంలోనే అతి ప్రాచీనమైన యురోపియన్ శైలి చర్చి అది. దానిని గురించి ఒక గైడ్ వివరించి, "సుప్రసిద్ధ పోర్చుగీసు నావికుడు వాస్కోడాగామా మృతదేహం ఇక్కడే సమాధి చేయబడింది," అన్నాడు. "అలాగా!" అని ఆశ్చర్యపోయాడు ఉదయ్.

క్రైస్తవమతం, యూరపులో గుర్తింపుపొంది, రూపు సంతరించుకోవడానికి దాదాపు మూడు శతాబ్దాలకు పూర్వమే ఇక్కడికి వచ్చింది. ఏసుక్రీస్తు పన్నెండు మంది శిష్యులలో ఒకడైన సెయింట్ థామస్ క్రీ.శ. 52లో కేరళ తీరానికి వచ్చాడని చెబుతారు. పశ్చిమ సముద్ర తీరంలో ఆయన చాలా చర్చిలు నెలకొల్పాడు. "కేరళ బహుళ సంస్కృతీ మిళిత సమాజం. అన్ని మతాలూ, సంస్కృతులూ ఇక్కడ ఉన్నాయి," అన్నది తల్లి. క్రైస్తవులతోపాటు పలువురు యూదులు



కూడా ఓడలో ఇక్కడికి వచ్చారు. సాక్షాత్తు మహమ్మదు ప్రవక్త పంపిన కొందరు అనుచరులు క్రీ.శ.610లో కేరళ చేరుకున్నారనీ, 14వ శతాబ్దిలో క్విలాన్‌లో ఐదు మసీదులు నిర్మించబడ్డాయనీ చెబుతారు.




బాగా అలిసి పోయిన అన్నా చెల్లెళ్ళకు కర్ణాటక రాష్ట్రం శ్రావణ బెళగొళ హోటల్‌లో వేడి వేడి ఇడ్లీ వడ తినడంతో ఉత్సాహం పుట్టుకువచ్చింది. అరుణ దూరం నుంచి బ్రహ్మాండమైన గోమతేశ్వర విగ్రహం చూసి ఆశ్చర్యపోయింది. దాని ఎత్తు పదిహేడు మీటర్లు. మనదేశంలోని ప్రాచీనమైన, పవిత్రమైన జైనయాత్రాస్థలం కర్ణాటకలోని శ్రావణ బెళగొళ. ఇది ఒక చిన్న పట్టణం. 26 కి.మీ దూరం నుంచే ఎత్తయిన ఈ గోమతేశ్వర విగ్రహం కనిపిస్తున్నది. ప్రపంచంలోకెల్లా అతిపెద్దదైన ఏకశిలా విగ్రహం ఇది. ఆ తరవాత వాళ్ళు కర్ణాటకలోని బిజాపూర్‌లోవున్న గోల్ గుంబజ్ చేరుకున్నారు. గోల్‌గుంబజ్‌లోని 'విస్పరింగ్ గ్యాలరీ' కి ఒక చివర నిలబడి అరుణ మెల్లగా నోటితో శబ్దం పుట్టించింది. అది ఆ గ్యాలరీ అవతలి చివర నిలబడివున్న ఉదయ్ విని, "ఆహా! అద్భుతం!" అని విస్తుపోయాడు. "అందుకే దీనికి గుసగుసల వసారా (విస్పరింగ్ గ్యాలరీ)అని పేరు వచ్చింది," అన్నాడు తండ్రి. ప్రపంచంలోవున్న అతి పెద్ద గుండ్రటి గుమ్మటాలలో గోల్ గుంబజ్ ఒకటి. రోమ్ నగరంలోని సెయింట్ పీటర్స్ డోమ్‌కు తరవాత దీనినే చెబుతారు. దాదాపు 42మీ॥ వ్యాసం ఉన్న ఈ గుమ్మటం స్తంభాల ఆధారం లేకుండా ఉండడం గొప్ప విశేషంగా చెబుతారు.










మన దేశం మొత్తం మీద చాలా ఉత్తేజభరితమైన, ఉత్సాహం ఉరకలు వేసే, చూసిన చోటల్లా రంగురంగుల కన్నుల విందు చేస్తూ వినోద కార్యకలాపాలు జరిగే ప్రాంతానికి ఉదయ్ కుటుంబం చేరుకున్నది. ఈ చిత్రాన్ని జాగ్రత్తగా పరిశీలించి చూడండి. వారెక్కడికి చేరుకున్నారో ఊహించండి. ఈ చిత్రంలో మిగిలివున్న భాగానికి మీరు రంగులు వేయవలసి ఉంటుంది. కానివ్వండి మరి!
POLICE
POLICE
VIVA O CARNAVAL
VIVA O RNAVAL
HOTEL MRO
సమాధానం:
ఉదయ్ కుటుంబం చేరుకున్న ప్రాంతం:గోవా

ఒక నెల గడిచిపోయింది. ఉదయ్ కుటుంబం ఇల్లు చేరింది. అయినా వినోదయాత్ర ఇంకా పూర్తి కాలేదు. "సమీపంలో ఉన్న దానిని మీకు చూపాలి. అది అక్కడ ఉన్నట్టే మీకు తెలియదు," అని చెప్పి, తండ్రి వాళ్ళను కారులో తీసుకువెళ్ళాడు. వాళ్ళు మహారాష్ట్ర థానే జిల్లా పొలిమేరను చేరుకున్నారు. కారు గ్రామంలాంటి ప్రాంతాన్ని చేరుకున్నది. కారును చూడగానే అక్కడి ప్రజలు కొందరు దాని చుట్టూ బిలబిలమని చేరారు. "వీళ్ళందరూ మహారాష్ట్ర - గుజరాత్ ప్రాంతాలలో నివసించే వార్లీ తెగవాళ్ళు," అంటూ తండ్రి వాళ్ళను గురించి చెప్పి, వాళ్ళవైపు తిరిగి ఏదో మాట్లాడాడు. ఒక పురుషుడు, స్త్రీ ఉదయ్ కుటుంబాన్ని విశాలంగా ఉన్న ఒక గుడిసెలోకి తీసుకుపోయారు. ఆ ఇంటి గోడలపై కొన్ని చిత్రాలు గీయబడి ఉన్నాయి. వాటిని చూపుతూ తండ్రి, " వీటిని వార్లీ చిత్రాలంటారు. ఇవి ప్రపంచ ప్రసిద్ధిగాంచాయి," అని వివరించాడు. ఉదయ్-అరుణలు వాటిని ఆసక్తిగా చూడసాగారు.

ఆ చిత్రాలలో అక్కడి ప్రజలు మొక్కే దేవుళ్ళు, జంతువులు, చెట్లు, ప్రజల వృత్తులు, వేట, వ్యవసాయం, నృత్యం అన్నీ అందంగా చిత్రించబడ్డాయి.

వార్లీ చిత్రాలు చిత్రించడానికి కావలసిన రంగులూ, కుంచెలూ వాళ్ళే తయారు చేసుకుంటారు. వాళ్ళు ఒక్క తెలుపు రంగు మాత్రమే ఉపయోగిస్తారు. మెత్తటి బియ్యం పిండి నీళ్ళతో కలిపి వాళ్ళే రంగు తయారు చేసుకుంటారు. సన్నటి తుంగలాంటి మూడంగుళాల పుల్లలను కుంచెలుగా ఉపయోగిస్తారు. ముక్కోణాకారాలూ, కాళ్ళూ, చేతులూ, గీతలూ, జంతువుల బొమ్మలూ గీస్తారు.

మన భారత వినోదయాత్ర ఎలాఉంది?







మీరూ ఒకటి చేస్తారు కదూ!



# అత్తగారి జబ్బు

నాలుగైదేళ్ళ వయసువాడై వుండగా రవీంద్రకు తండ్రి పోయాడు. ఆనాటి నుంచీ తల్లి శేషాయమ్మ, అతణ్ణి ఎంతో క్రమశిక్షణతో పెంచింది. రవీంద్ర బాగా చదువుకుని కచ్చేరీలో మంచి ఉద్యోగం సంపాదించాడు. అతడికి కోరినంత కట్నంతో పిల్లనిస్తామంటూ చాలా సంబంధాలు రాసాగినై.

అయితే, శేషాయమ్మను దేవీఆలయంలో కలిసిన బాపాయమ్మ, 'శేషాయమ్మా, నా మాట విని కట్నం కోసం కక్కుర్తిపడకు. పేదింటిపిల్లయితే భయం, భక్తితో వుంటుంది. నేను కట్నం కోసం ఆశపడి జమీందారీ సంబంధం చేసుకుని అనుభవిస్తున్నాను. నా కోడలు నన్ను కూరాకులో పురుగును చూసినట్టు చూస్తున్నది,'' అన్నది చీరకొంగుతో కళ్ళు ఒత్తుకుంటూ.

బాపాయమ్మ మాటలు శేషాయమ్మ మనసులో బాగా నాటుకుపోయాయి. ఒక నాటి సాయంత్రం ఆమె ఆలయానికి వెళ్ళినప్పుడు, ఒక ఇరవై ఏళ్ళ అమ్మాయి కమ్మని గాత్రంతో, దేవీస్తుతి ఆలపిస్తున్నది. ఆ అమ్మాయి ముఖంలో లక్ష్మీకళ వున్నది. ఆ అమ్మాయి ప్రసాదం తీసుకుని వెళ్ళాక, ఆమెను గురించి పూజారిని అడిగింది శేషాయమ్మ.

''నువ్వెరగవా! షావుకారు దగ్గర పద్దులు రాసే పరాంకుశం కూతురు, రత్న. పేరుకు తగ్గట్టుగా రత్నంలాంటి పిల్ల. తల్లి లేదు. పాపం, ఆ పరాంకుశానికి కట్నం ఇచ్చి పెళ్ళి చేసే స్థోమతు లేదు. ఆ దేవుడే కరుణించాలి,'' అన్నాడు పూజారి.

ఆ క్షణంలోనే రత్న తనకు అన్నివిధాలా తగిన కోడలని తోచింది, శేషాయమ్మకు. ఆమె స్వయంగా పూనుకోవడంతో, నెల తిరగక్కుండా రవీంద్ర, రత్నల వివాహం జరిగిపోయింది.

కాపురానికి వచ్చిన రోజున రత్న, అత్తగారి పాదాలకు నమస్కరించి, ''నా పాలిటి దేవత

మాచిరాజు కామేశ్వరరావు



మీరు! మీరు ఎలా చెబితే అలా నడుచు కుంటాను. మీరిక వంటింటి ఛాయలకు రావద్దు. హాయిగా కాలుమీద కాలు వేసు కుని కూర్చోండి. నేను అన్నీ మీ చేతికి అంది స్తాను,'' అన్నది.

కోడలి మంచితనానికి మురిసిపోయింది శేషాయమ్మ. ఆ రోజు మొదలు శేషాయమ్మకు పూర్తి విశ్రాంతి లభించింది. ఆవిడకు కాలు కదిపే అవసరమే లేదు. రత్న, కన్నతల్లికన్నా ఎక్కువగా అత్తగారిని అమిత ప్రేమతో ఆద రించేది.

అయితే, ఆరు నెలలు తిరక్కుండానే శేషాయమ్మ అంతుచిక్కని వ్యాధితో మంచం పట్టింది. ఆమెకు ఎటూ కదలకుండానే గుండె దడ, ఆయాసం! ఎంత తిన్నా నీరసం. పైపెచ్చు ప్రతి చిన్న విషయానికీ చిరాకు, కోపం పెరిగిపోయాయి. ఎంతమంది వైద్యు లకు చూపించినా, ఆమె జబ్బేమిటో అంతు బట్టలేదు.

''మీకు మధుమేహవ్యాధి లేదు; నీరస మంటూ వుండకూడదు. రక్తపోటు లేదు; చిరాకు, కోపం పెరగకూడదు. గుండె భేషుగ్గా వుంది;మరి ఆయాసం ఎందుకువస్తున్నట్టు! అసలు మీకు ఏ జబ్బూ వున్నట్టుగా కనిపిం చడంలేదు,'' అంటూనే, ఏవో మందులు ఇచ్చేవారు, ఆమెను పరీక్ష చేసిన వైద్యులు.

ఆ మందులతో శేషాయమ్మకు ఏమాత్రం స్వస్తత చేకూరలేదు. ఒక సాయంత్రం ఆమె శ్వాస తీసుకోవడానిక్కూడా ఇబ్బంది పడుతూ, ''నీ కడుపున ఒక కాయ కాస్తే చూసి ఆనంద పడాలనుకున్నాను. కానీ ఆ అదృష్టం నాకు లేదే, రత్నం!'' అన్నది కోడలితో.

ఆ రాత్రి రత్న కళ్ళనీళ్ళతో, అత్త అన్న మాటలు భర్తకు చెప్పి, ''నిక్షేపంలా తిరిగే ఆవిడ అలా మంచం పట్టడం చూస్తూంటే, కడుపు తరుక్కుపోతున్నది. రేపే ఆవిడను పట్నం తీసుకువెళ్ళి, మంచి వైద్యులకు చూపించండి!'' అన్నది.

రవీంద్ర మర్నాడే తల్లిని తీసుకుని పట్నం వెళ్ళాడు. ఆ సాయంకాలం రత్న పెదనాన్న కొడుకు రాజారాం ఆమెను చూడవచ్చాడు. ''ఎలావుంది చెల్లీ, నీ కాపురం?'' అంటూ అతను ఆప్యాయంగా అడగగానే రత్న కళ్ళ నీళ్ళు పెట్టుకుని, అత్తగారి అనారోగ్యం గురించి చెప్పి, ''అన్నయ్యా, ఆవిడ కేమ యినా అయితే నేను భరించలేను!'' అన్నది.

అంతా విన్న రాజారాం తల పంకించి, ''ఒక వారం రోజులపాటు పట్నంలో పనిపడి వచ్చి, ఒకసారి నిన్ను చూసిపోదామని ఇటు రావడం జరిగింది.మీ ఆయనా, అత్తగారూ పట్నం నుంచి తిరిగి వచ్చాక మళ్ళీ వస్తాను.

నన్ను ఒక వైద్యుడిగా, మీ అత్తగారికి పరిచయం చెయ్యి. ఆవిడ జబ్బు తగ్గించే ప్రయత్నంచేస్తాను,'' అని చెప్పాడు.

రెండు రోజుల తర్వాత శేషాయమ్మ, రవీంద్ర పట్నం నుంచి తిరిగి వచ్చారు. అక్కడి వైద్యులు, ఆమెకు అన్ని పరీక్షలూ చేసి, ఏ వ్యాధీ లేదని తేల్చి చెప్పారు.

ఆ రోజు సాయంత్రం వచ్చిన రాజారాంను, రత్న, అత్తగారికి వైద్యుడంటూ పరిచయం చేసి, ''ఈ మధ్య మా అత్తగారి ఆరోగ్యం ఏమీ బావుండడం లేదు. కాస్త పరీక్ష చేసి చూడు, అన్నయ్యా!'' అన్నది.

రాజారాం, శేషాయమ్మ చేయి పట్టుకుని, నాడి పరీక్షిస్తున్నట్టు నటించి, ''మీకు చెప్పలేనంత గుండెదడ, దానికి తోడు ఆయాసం, అవునా?'' అన్నాడు.

''అవును, బాబూ! అలా అని చెబితే ఏ వైద్యుడూ నమ్మడం లేదు,'' అన్నది శేషాయమ్మ దిగులుగా. రాజారాం, ఆమె కళ్ళూ, నాలుకా పరీక్షించి, ''ఈ జబ్బు లక్షణంలో నీరసం కూడా వుంటుంది,'' అన్నాడు.

''అవును! మంచం దిగి పట్టుమని నాలుగడుగులు కూడా వేయలేకపోతున్నాను,'' అన్నది శేషాయమ్మ. తన రోగలక్షణాలన్నీ కేవలం నాడి చూసి చెప్పేస్తున్న రాజారాం కేసి, శేషాయమ్మ ఆశ్చర్యంగా చూస్తూ, ''నా బాధలన్నీ చదివినట్టుగా చెప్పేస్తున్నావు, బాబూ! ప్రతి వైద్యుడూ, నాకే జబ్బూ లేదనే వాడే,'' అన్నది శేషాయమ్మ నిష్ఠూరంగా.

రాజారాం తన సంచీలోంచి నగిషీలు చెక్కిన ఒక చిన్న డబ్బా తీసి, శేషాయమ్మకు ఇస్తూ, ''ఈ డబ్బాలోని చూర్ణం రోజుకు రెండు



సార్లు చిటికెడు చొప్పున భోజనం తరవాత వేసుకోండి. బాగా గుర్తుంచుకోండి; చిటికెడంటే చిటికెడు. దీనితో పాటు మీరు కాస్త వ్యాయామం లాంటిది కూడా చేయాలి. పెరట్లో తోటపని చూడండి. శివాలయానికి వెళ్ళేప్పుడు, ఏ పెళ్ళినడకోలాంటిది కాకుండా, చురుగ్గా నడవడం అలవరచుకోండి. మీకున్న వ్యాధి లక్షణాలన్నీ, ఒక్క వారం రోజుల్లో మటుమాయమవుతాయి,'' అని చెప్పాడు.

శేషాయమ్మ క్రమం తప్పకుండా, రాజారాం ఇచ్చిన మందు వాడుతూ తోటపనితోపాటు, ఇంటా బయటా కూడా వేగంగా నడవడం ఆరంభించింది.

రాజారాం చెప్పమన్నట్టుగా రవీంద్ర, తల్లితో, ''ఈ రత్న వంట నాకేమీ నచ్చడం లేదు. ఈమధ్య నోరు చవిచచ్చిపోయిందనుకో! కనీసం ఒక పూట అయినా నువ్వు వంట చేసి, పూర్వంలా కమ్మని భోజనం పెట్టు,'' అన్నాడు.

కొడుకు మాటలకు శేషాయమ్మ మురిసి పోయి, పగటి వంట తను చేయడం మొదలు పెట్టింది. ఇలా రెండు వారాలు గడిచేసరికి శేషాయమ్మకు తను పూర్తిగా ఆరోగ్యవంతు రాలైనట్టు అనిపించసాగింది.

ఆ తర్వాత ఒకనాటి సాయంకాలం, శేషా యమ్మ శివాలయానికి వెళ్ళినప్పుడు, రత్నను చూడడానికి వచ్చి రాజారాం, ఆమెను, ''మీ అత్తగారి జబ్బు నయమై పోయినట్టేనా?'' అని అడిగాడు.

''నీ మందు పుణ్యాన పూర్తిగా నయమై పోయింది. అయినా, వైద్యం చదవని నువ్వు, అత్తయ్యకు అంత బాగా పనిచేసే మందు ఎలా ఇవ్వగలిగావు?'' అని ప్రశ్నించిందిరత్న.

ఆ ప్రశ్నకు రాజారాం పెద్దగా నవ్వి, ''నేను వైద్యం చదవకపోయినా, మనుషుల్ని బాగా చదివాను. రోగికి రోగం నయం కావాలంటే, ముందు వైద్యుడి మీద గురి, నమ్మకం ఏర్పడాలి. మీ అత్తగారికి నా మీద అలాంటి నమ్మకం ఏర్పడేలా చేసుకున్నాను. పోతే, మీ అత్తగారికొచ్చిన జబ్బు కేవలం మానసికం. ఒక్కగానొక్క కొడుక్కు పెళ్ళి చేసిన తర్వాత, చాలామంది తల్లులకు వచ్చే జబ్బే ఇది! ఆ ఇంట తన ప్రాధాన్యత తగ్గిపోయిందనీ, కొడుకు చేయిదాటి పోయాడనీ, అతడికిక తన అవసరం లేదనీ మనోవ్యాధి పట్టు కుని, ఏదో జబ్బు చేసినట్టుగా భ్రమపడతారు. నేనిచ్చిన మందు మిరియాలు, చక్కెర కలిపి దంపిన మిశ్రమం! ఇక నుంచి మీ అత్త గారిని విశ్రాంతిగా కూర్చోమనక, మీతో కలిసిమెలిసి అన్నిపనులూ చేయనీయండి. అన్ని విషయాల్లో ఆవిడ సలహా తీసుకోండి. అన్నిటికన్నా ముఖ్యం — ఆవిడ అవసరం మీకు తప్పనిసరి అన్నట్టుగా ప్రవర్తించండి. ఇక ఆవిణ్ణి భ్రమలు కల్పించే ఏ జబ్బులూ అంటవు,'' అన్నాడు.

ఇదంతా గుమ్మంలో వుండి వింటున్న రవీంద్ర, ''నీమేలుమరవలేను. అమ్మనుతిరిగి మామూలుమనిషినిచేశావు,'' అంటూరాజా రాంచేతుల్ని తనచేతుల్లోకి తీసుకున్నాడు.



64. ధృతరాష్ట్రుడి మరణం

# మహాభారతం

ధృతరాష్ట్రుడు తన అతిథులకు తాను తినే దుంపలూ, పళ్ళూ పెట్టాడు. ఆ రాత్రి పాండవులు తమ తల్లికి నాలుగు వైపులా పడుకున్నారు. మర్నాడు వాళ్ళు స్త్రీలనూ, పురోహితులనూ వెంటబెట్టుకుని చుట్టుపట్ల ప్రదేశాలు చూడబోయారు. ఒకచోట అగ్నివేదికలు కనిపించాయి. అగ్నులు మండుతున్నాయి. వాటిలో మునులు మంత్రయుక్తంగా హోమాలు చేస్తున్నారు. అక్కడ మృగాలు గుంపులు గుంపులుగా ఎలాంటి భయమూ లేకుండా యథేచ్ఛగా సంచరిస్తున్నాయి. అలాగే రకరకాల పక్షులు కూడా స్వేచ్ఛగా సంచరిస్తున్నాయి.

పాండవులు ఆ ఆశ్రమం పర్యటించి, అక్కడి మునులకు చర్మాలూ, కంబళాలూ ఇచ్చి, ధృతరాష్ట్రుడి వద్దకు తిరిగివచ్చారు.

ఆ సమయంలో వ్యాసుడు తన శిష్యులతో సహా అక్కడికి వచ్చాడు. ఆయన ధృతరాష్ట్రుడితో, ''వనవాసం నీకు సుఖంగా ఉంటున్నదా? పుత్రశోకం నిన్నిప్పుడు బాధించటం లేదు గదా? గాంధారి ఇక్కడ నీ మూలాన నీవెంట అడవికి వచ్చి కష్టాలు పడటంలేదు గద? కుంతి మిమ్మల్ని చక్కగా కనిపెట్టి ఉంటున్నది గద?'' అని కుశలం అడిగాడు.

తరవాత ఆయన విదురుణ్ణి గురించి చెబుతూ, ''విదురుడే ధర్మరాజు. మాండవ్య





మహాముని శాపం చేత యమధర్మరాజు విదురుడుగా నీకు తమ్ముడై పుట్టాడు. ఆ యమధర్మరాజే తన యోగబలంతో ధర్మ రాజు కూడా అయ్యాడు. అందుకే విదురుడు ధర్మరాజులో ఐక్యమయ్యాడు. అందుకోసం అతను తన యోగబలాన్ని ఉపయోగించు కున్నాడు,'' అన్నాడు.

పాండవులు ఆ ఆశ్రమంలో నెలరోజులు గడిపారు. ఆ తరవాత మళ్ళీ వ్యాసుడు అక్కడికి వచ్చాడు. ఆయన చెప్పిన కథలతో అందరికీ మంచి కాలక్షేపం జరిగింది.

అంతలో అక్కడికి నారదుడూ, పర్వ తుడూ, దేవలుడూ, విశ్వావసుడూ, తుంబు రుడూ, చిత్రసేనుడూ వచ్చారు. ధృతరాష్ట్రుడి అనుమతితో ధర్మరాజు వారినందరినీ సత్కరిం చాడు. వ్యాసుడూ, ఇతర అతిథులూ, పాండ వులూ, ధృతరాష్ట్రుడూ, గాంధారీ, కుంతీ, ద్రౌపదీ, సుభద్రా మొదలైన స్త్రీలూ కూర్చు న్నారు. ప్రాచీన మహర్షుల కథలూ, దేవాసు రుల కథలూ చెప్పుకున్నారు.

ఒకసారి ధృతరాష్ట్రుడు వ్యాసుడితో, ''మీరు రావటంవల్ల నా జన్మ సఫలమయింది. నాకు పరలోకభయంలేదు. కాని, నా కొడు కుల పాపబుద్ధి మూలంగా పుణ్యాత్ములైన పాండవులు అవమానం పొందారు. ఎందరో యువకులు యుద్ధంలో ప్రాణాలు పోగొట్టు కున్నారు. యుద్ధంలో చచ్చిన నా కొడుకు లకూ, వారి కొడుకులకూ ఏం గతి కలుగు తుందో? రాత్రింబవళ్ళు నాకదే తీరని మనో వేదన. అందుచేత నాకు శాంతి లేకుండా ఉన్నది,'' అన్నాడు.

ధృతరాష్ట్రుడు ఇలా అనే సరికి గాంధారికి దుఃఖం పొంగి వచ్చింది. ఆమెతోబాటు కుంతీ, ద్రౌపదీ, సుభద్రా, స్త్రీలూ ఏడవ సాగారు.

గాంధారి చేతులు జోడించి వ్యాసుడికి నమస్కారం చేసి, ''మా కొడుకులు పోయి పదహారేళ్ళయింది. ఇంత కాలమూ నా భర్త వారికోసం దుఃఖిస్తూనే ఉన్నాడు. ద్రౌపది తన కొడుకుల కోసమూ, అన్నల కోసమూ ఏడు స్తున్నది. సుభద్ర అభిమన్యుడి కోసం ఏడు స్తున్నది. ఈ భూరిశ్రవుడి భార్య తన మామ గారినీ, భర్తనూ, కొడుకునూ పోగొట్టుకుని ఏడుస్తున్నది. మా కొడుకుల భార్యలు నూరు గురూ ఎప్పుడూ దీనంగా ఏడుస్తున్నారు. ఇంతమంది దుఃఖమూ పోగొట్టే ఉపాయం ఉంటే చూడండి,'' అన్నది.

వ్యాసుడు కుంతిని, ''నీ మనసులో ఏదో ఉన్నది. ఏమిటది?'' అని అడిగాడు.

తాను కర్ణుడి కోసం దుఃఖిస్తున్నట్టు కుంతి చెప్పింది.

వ్యాసుడు గాంధారితో, ''నువ్వు నీ కొడుకులనూ, బంధువుల నందరినీ చూస్తావు. కుంతి కర్ణుణ్ణీ,సుభద్ర అభిమన్యుణ్ణీ,ద్రౌపది తన కొడుకులనూ, తండ్రినీ, అన్నలనూ చూస్తారు.ఈ ఆలోచన నాకు ముందే ఉన్నది. దాన్ని నువ్వూ, కుంతీ బయటికి లాగారు. మీరు ఎవరి కోసమూ దుఃఖించే అవసరం లేదు.భారత యుద్ధంలో చనిపోయిన వారందరూ వేరువేరు అంశలతో పుట్టిన దేవతలూ, రాక్షసులూనూ. ధృతరాష్ట్రుడు ఒక గంధర్వ రాజు. పాండురాజు మరుత్తుల గణానికి చెందినవాడు. విదురుడూ, ధర్మరాజూ యముడి అంశన పుట్టిన వాళ్ళు. దుర్యోధనుడు కలి, శకుని ద్వాపరం. దుశ్శాసనుడు మొదలైన వారందరిదీ రాక్షసాంశ. భీముడు వాయువు అంశనా, అర్జునుడు నరుడనే మహర్షి అంశనా, నకుల సహదేవులు అశ్వినుల అంశనా, అభిమన్యుడు చంద్రుడి అంశనా, ద్రౌపదీ ధృష్టద్యుమ్నులు అగ్ని అంశనా పుట్టారు. శిఖండిది రాక్షసాంశ. బృహస్పతి అంశన ద్రోణుడూ, శంకరుడి అంశన అశ్వత్థామా పుట్టారు. భీష్ముడు వసువులలో ఒకడు. మీరందరూ భాగీరథీ తీరానికి వెళ్ళండి. యుద్ధంలో చనిపోయిన వారినందరినీ అక్కడ మీకు చూపించి, మీ దుఃఖం పోగొట్టుతాను,'' అన్నాడు.

ఈ మాటలు వినేసరికి అందరికీ గొప్ప ఉత్సాహం పుట్టుకొచ్చింది. అందరూ గంగా తీరానికి బయలుదేరారు. ధృతరాష్ట్రుడు పాండవులనూ, మునులనూ, ఇతరులనూ



వెంటతీసుకుపోయాడు.అందరూ గంగా తీరంచేరి,పగలంతా విశ్రమించారు.సూర్యుడు అస్తమించాడు.అందరూ స్నానాలు చేసి,కాలకృత్యాలు నిర్వర్తించారు.

అనంతరం అందరూ వ్యాసుడి వద్ద చేరారు. అప్పుడు వ్యాసుడు గంగాజలంలో మునిగి, పాండవ, కౌరవ యోధులనూ, భారత యుద్ధంలో చనిపోయిన నానా రాజులనూ రమ్మని పిలిచాడు.

వెంటనే నదీతీరం వెంబడి పెద్ద కలకలం వినిపించింది. పూర్వంలాగే కౌరవ పాండవ సేనలు కనిపించాయి. భీష్ముడూ, ద్రోణుడూ మొదలైనవారు ఒక్కరొక్కరే నదిలో నుంచి రాసాగారు. విరాటుడూ, ద్రుపదుడూ, ఉపపాండవులూ, అభిమన్యుడూ, ఘటోత్కచుడూ, కర్ణుడూ, దుర్యోధనుడూ మొదలైన వారందరూ పూర్వం ఏయే వేషాలలో యుద్ధా

నికి వెళ్ళారో ఆ వేషాలతో, అవే వాహనాలపైన గంగ నుంచి వెలువడి వచ్చారు. వారి మధ్య ఇప్పుడు వైరాలేమీ లేవు. వ్యాసుడు తన తపశ్శక్తితో ధృతరాష్ట్రుడికి దివ్యదృష్టి ఇచ్చాడు. గాంధారీ ధృతరాష్ట్రులిద్దరూ తమవారినంద రినీ చూడగలిగారు.మిగిలిన వాళ్ళకుకూడా, చచ్చిపోయిన వారంతా ఇలా తిరిగి రావటం మహాద్భుత మనిపించింది

బతికున్న వారు చచ్చిపోయిన వారిని కలుసుకుని ఎంతో ఆనందించారు. పాండవులు కర్ణుణ్ణీ, అభిమన్యుణ్ణీ, ఉపపాండవులనూ కలుసుకున్నారు. ఆ రాత్రి అందరికీ ఎంతో సంతోషంగా గడిచింది. తరవాత చచ్చిన వారంతా ఎలా వచ్చారో అలాగే గంగలో ప్రవేశించి క్రమంగా అదృశ్యమైపోయారు.

వ్యాసుడు బతికున్న కౌరవ కాంతలతో, "మీలో ఎవరైనా భర్తలవెంట వారుండే లోకాలకు పోదలిస్తే నదిలో ప్రవేశించండి," అన్నాడు. ధృతరాష్ట్రుడి కోడళ్ళు తమ అత్త మామల అనుమతితో గంగలో ప్రవేశించారు.

ఈ సంఘటన జరిగిన అనంతరం ధృతరాష్ట్రుడి దుఃఖం పూర్తిగా పోయింది. ఆయన తన ఆశ్రమానికి తిరిగి వెళ్ళాడు. నెల రోజులకు పైగా తన వెంట ఉన్న పాండవులను ఆయన హస్తినాపురానికి తిరిగివెళ్ళమనీ, రాజ్యం చూసుకోమనీ హెచ్చరించాడు. ధర్మరాజుకు వెళ్ళిపోవాలనీ లేదు. రాజ్యం చెయ్యాలనీ లేదు. రాజ్యం శూన్యంగా ఉన్నది. ధర్మరాజులాగే సహదేవుడికికూడా కుంతిని వదిలి పెట్టి పోవటం ఇష్టంలేదు. కాని కుంతి





వాళ్ళను హస్తినాపురానికి తిరిగిపొండి అని గట్టిగా చెప్పింది. వాళ్ళు వెళ్ళక తప్పలేదు. ధృతరాష్ట్రుడు పాండవులను అయిదుగురునీ కౌగలించుకుని, వీడ్కోలు చెప్పాడు. ధర్మరాజు హస్తినాపురానికి బయలు దేరాడు.

తరవాత కొంతకాలానికి ధర్మరాజును చూడటానికి నారదుడు వచ్చాడు. ధర్మరాజు ఆయనకు సకల మర్యాదలూ చేసి, కుశల ప్రశ్నలు వేశాడు. తాను గంగాతీరాన తపోవనాలు చూసి వస్తున్నానని నారదుడు చెప్పే సరికి, ధర్మరాజు, "మా పెత్తండ్రి కనిపించాడా? కులాసాగా ఉన్నాడా? గాంధారీ, కుంతీ, సంజయుడూ ఎలా ఉన్నారు?" అంటూ అడిగాడు.

దానికి నారదుడు ఇలా చెప్పాడు:

"ధర్మరాజా, మీ అన్నదమ్ములు వచ్చేసిన అనంతరం ధృతరాష్ట్రుడు గాంధారీ, కుంతీలతో కురుక్షేత్రం నుంచి గంగాద్వారం వెళ్ళాడు. సంజయుడూ, యాజకులైన బ్రాహ్మణులూ అగ్నిహోత్రాలు తీసుకుపోయారు. గంగాద్వారంవద్ద నీపెత్తండ్రి వాయుభక్షణ అవలంబించి ఆరుమాసాల పాటు కఠోరమైన తపస్సు చేశాడు. గాంధారి జలాహారం తీసుకున్నది. కుంతి మాసోపవాస వ్రతం పట్టింది. సంజయుడు రోజుకు ఒక్క భోజనం చేశాడు. యాజకులు మాత్రం విడవకుండా అగ్నిహోత్రాలు వ్రేల్చారు. తరవాత ధృతరాష్ట్రుడు వనాలలో తిరగసాగాడు. సంజయుడు ఆయనకు తోడు వెళ్ళాడు. గాంధారీ, కుంతీ ఆయన వెనుకనే తిరిగారు. కుంతి గాంధారిని కనిపెట్టుకుని ఉండేది. ఇంతలో ఒకనాడు ధృతరాష్ట్రుడు గంగలో స్నానం చేసి, తన ఆశ్రమం కేసి వస్తూండగా, హఠాత్తుగా అరణ్యంఅంతా అంటుకున్నది.

కార్చిచ్చు తమకు సమీపంలోకి వచ్చిందని తెలిసి ధృతరాష్ట్రుడు సంజయుడితో, "నువ్వు అగ్నిలేని దిక్కుగా వెళ్ళిపో.మేం అగ్నిలో కాలి ఉత్తమ గతికి పోతాం," అన్నాడు.

సంజయుడు అదుర్దాగా, "రాజా, నువ్వు అగ్నిలో మరణించటం నాకిష్టంలేదు, అగ్ని చూడబోతేచుట్టుముట్టింది.ఏంచెయ్యాలి?" అన్నాడు.

"సంజయా, తపస్వులు గాలీ, నీరూ, నిప్పు–దేనితోనైనా చావటానికి ఇష్టపడతారు. నువ్వు తాత్సారం చెయ్యకవెళ్ళిపో," అన్నాడు ధృతరాష్ట్రుడు.

సంజయుడు ధృతరాష్ట్రుడికీ, కుంతీ గాంధారీలకూ ప్రదక్షిణం చేసి, వారిని యోగ సమాధిలోకి పొమ్మని చెప్పాడు. ముగ్గురూ

అలాగే చేశారు. సంజయుడు కార్చిచ్చులో నుంచి బయటపడి గంగా తీరాన ఆశ్రమాలకు చేరుకుని నారదుణ్ణి చూశాడు. ధృతరాష్ట్రుడూ, గాంధారీ, కుంతీ కార్చిచ్చులో కాలిపోయారు.

ఆ సంగతి నారదుడికి చెప్పి,సంజయుడు హిమాలయానికి వెళ్ళాడు.

ఈ వార్త తెలియగానే పాండవులతోబాటు నగరంలో అందరూ శోకించారు. కార్చిచ్చుకు కారణమైన అగ్ని ధృతరాష్ట్రుడిదేననీ, తన అగ్నితోనే తాను మరణించి ధృతరాష్ట్రుడు ఉత్తమగతి పొందాడనీ చెప్పి నారదుడు ధర్మరాజును ఊరడించాడు.

ధర్మరాజు గంగను చేరి చనిపోయిన వారికి జలతర్పణాలు విడిచాడు. తరవాత శ్రాద్ధం పెట్టి, పన్నెండో నాడు దానాలు చేశాడు.

భారత యుద్ధం ముగిసిన పద్దెనిమిదేళ్ళకు ధృతరాష్ట్రుడు పోయాడు. అందులో చివరి మూడేళ్ళు వనవాసంలో గడిచాయి.

ధృతరాష్ట్రుడు పోయిన అనంతరం మరో పద్దెనిమిదేళ్ళు ధర్మరాజు రాజ్యం చేశాడు. ఆ సమయంలో ఆయనకు ఒక దారుణవార్త చేరింది; ముసలం (రోకలి) మూలాన యాదవులందరూ చచ్చిపోయారట; ఆఖరికి కృష్ణుడూ, బలరాముడూ మాత్రమే మిగిలారట!

ధర్మరాజు తన తమ్ములను పిలిపించి, "యాదవులందరూ తమలో తాము కొట్టుకుని చచ్చారట. ఇప్పుడేం చెయ్యాలి?" అని అడిగాడు.

యాదవ వినాశం ఎలా జరిగిందంటే:

ఒకసారి విశ్వామిత్రుడూ, కణ్వుడూ, నారదుడూ ద్వారకకు వెళ్ళారు. వాళ్ళురావటంచూసి సారణుడు మొదలైన యాదవులు కొందరు సాంబుడికి ఆడవేషం వేసి ఆ మునులకు చూపించి, "ఈవిడ గర్భిణి. ఈవిడ భర్త కొడుకు కావాలంటున్నాడు. ఈమెకు ఏ బిడ్డ పుట్టేది చెప్పండి," అని అడిగారు.

దానికి మునులు, "వృష్ణి, అంధకులను నాశనం చేసే ముసలం ఒకటి సాంబుడికి పుడుతుంది," అని జవాబు చెప్పారు.

తరవాత ఆ మునులు కృష్ణుణ్ణి కలుసుకుని, జరిగినది చెప్పారు.

కృష్ణుడు అది తెలుసుకుని మునులు శపించినట్టే జరుగుతుందని నిశ్చయం చేసుకున్నాడు.





# పట్టపురాణీ వంట!

జగదీశ్వరీదేవి, రాజువీరసేనుడి పట్టపురాణి. ఇద్దరూ ఎంతో అన్యోన్యంగా ప్రజలకు ఆదర్శ ప్రాయంగా వుండేవాళ్ళు.

ఒక కార్తీకమాసంలో, పున్నమిరోజు రాజూ, రాణీ వెన్నెల విహారానికి సముద్రతీరానికి వెళ్ళారు. అక్కడ సముద్రపు ఒడ్డున గుడిసె వేసుకుని, ఒక బెస్త దంపతులు కాపురం వుంటున్నారు. ఆ సమయంలో వాళ్ళు గుడిసె బయట నులక మంచం మీద కూర్చుని భోజనం చేస్తున్నారు. బెస్తవాడు గిన్నెలోంచి కూర మారు వడ్డించుకుంటూ, "మాణిక్యం! నీ చేతులతో ఏం చేసినా అమృతమే అనుకో. చేపలకూర అద్భుతం! రొయ్యల పులుసు అమోఘం!" అంటూపెళ్ళాన్నిమెచ్చుకున్నాడు.

బెస్తవాడి పెళ్ళాం, భర్తపొగడ్తలకు మురిసి పోతూ, " అబ్బా, అలాగా! రేపు నీ కిష్టమైన వాలగచేప పులుసు వండుతాను," అన్నది ఆనందంగా.

ఆ దృశ్యం రాణీ మనసుకు హత్తుకు పోయింది.

ఇకపై, తానే స్వయంగా వంటచేసి, భర్త మెప్పుపొందాలని, ఆ క్షణంలోనే రాణీ నిశ్చ యించుకున్నది.

మర్నాడామె వంటశాలలోని వంట వాళ్ళందర్నీ బయిటికి పంపించేసింది. తర్వాత తానే స్వయంగా కష్టపడి అపరాహ్ణంవేళకు వంట సిద్ధం చేసింది. వంటవాళ్ళు, ఆమె చేసిన వంటకాలనే రాజుకు వడ్డించారు.

రాజు వాటిని నోట పెట్టుకోకముందే, "మీ కోసం జీవితంలో మొట్టమొదటిసారిగా వంట చేశాను. రుచి చూసి ఎలావున్నదో చెప్పాలి మరి!" అన్నది రాణీ చిన్నగా నవ్వుతూ.

రాజుగారికి, రాణీ చేసిన వంటకాలు నోటపెట్టగానే, వాంతి వచ్చినంత పనయింది. పప్పులో ఉప్పులేదు. ఏదో కాయగూర కొరివికారం; పైగా నల్లగా మాడిపోయింది. పాయసంలో పాలు విరిగిపోయాయి. అయితే, రాణీగారి మనసు నొప్పించలేక ఆయన, "అమృత ప్రాయమైనవంట! నువ్వు ఇంత గొప్పగా వంట చేయగలవని, నేను కలలో

"తంపు"

కూడా ఊహించ లేదు సుమా!'' అన్నాడు. ఆ పొగడ్తకు రాణీ పొంగిపోయింది. కాని, తర్వాత ఆమె తినబోతే బొత్తిగా రుచించ లేదు. ఏమైనా, తన వంట భర్తకు నచ్చింది కాబట్టి, తాను భోజనం విషయంలో కొంత త్యాగం చేయక తప్పదని, ఆమె నిశ్చయించు కున్నది.

ఆమె భర్తతో, ''ఇకపై,రోజూ నేనేస్వయంగా వంట చేస్తాను. మీకు రోజూ అమృత తుల్య మైన భోజనమే అనుకోండి!'' అన్నది చిన్నగా నవ్వుతూ.

ఆమె మాటలు వింటూనే రాజుగారికి పొలమారింది; గుండెల్లో రాయిపడినట్ట యింది. ఆమె రోజూ వంట చేస్తాననడంతో భయకంపితుడై, '' నీకెందుకు మహారాణీ, ఈశ్రమ?'' అంటూ మెల్లగా నచ్చజెప్ప బోయాడు.

అయితే, ''భర్తకు వంట చేసి పెట్టడం శ్రమ అని, ఏ భారతనారీమణికూడా అను కోదు!'' అంటూ రాణీ తేల్చేసింది. ఆ రోజు నుంచీ రాజుగారికి కష్టకాలం ఆరంభమ యింది. రాణీరకరకాల వంటలు చేస్తున్నట్టు నిద్రలో ఆయనకు తగని పీడకలలు! పట్టు మని వారం తిరక్కుండానే ఆయనకు,జీవితం మీద మహ చెడ్డవిరక్తి పుట్టిపోయింది.

ఈ కఠోర సమస్యకు పరిష్కారమార్గ మేమిటో, ఎంత ఆలోచించినా రాజుకు అంతుపట్టలేదు. చివరకు ఆయనతన ఆస్థాన విదూషకుడు గోవర్ధనుణ్ణి పిలిచి, విషయ మంతా వివరించి, ''గోవర్ధనా! రాణీ గారి వంట భయంనుంచి కాపాడగలవాడివి నువ్వొక్కడివే! ఏం చేస్తావో ఏమో!'' అన్నాడు.



''భయపడకండి, మహారాజా! చక్రవర్తి పుట్టినరోజు వేడుకల్లో పాల్గొని, నాలుగు రోజుల్లో తిరిగి వస్తానుగదా.రాగానే మిమ్మల్ని, ఈ భయాల ఊబిలోంచి బయటకు లాగు తాను,'' అన్నాడు విదూషకుడు.

చక్రవర్తి పుట్టినరోజూ, రాజువీరసేనుడి తండ్రి ఆబ్దికం ఒకేరోజు వస్తాయి. అందు వల్ల ఆయన ఏనాడూ చక్రవర్తి పుట్టిన రోజు వేడుకలలో పాల్గొనలేదు.ఈసారి జరుగు తున్నవి చక్రవర్తి వివాహం జరిగాక, మొట్ట మొదటి పుట్టినరోజువేడుకలు,చాలాఘనంగా చేస్తున్నారు. చక్రవర్తి భార్య అతిలోక సౌందర్య వతిగా జనం చెప్పుకుంటున్నారు.

నాలుగురోజుల తర్వాత, విదూషకుడు వేడుకలలో పాల్గొని తిరిగి రాగానే, రాణి జగదీశ్వరీదేవి, అతణ్ణి అంతఃపురానికి పిలి పించుకున్నది. జనం గొప్పగా చెప్పుకునే చక్రవర్తి భార్య అందచందాల గురించి ఆరా తీయాలన్నదే ఆమె ఆత్రుత!

''వేడుకలు బాగా జరిగాయా? చక్రవర్తి భార్య గొప్ప సౌందర్యవతి అంటున్నారు. నిజమేనా?'' అని ఆమె విదూషకుణ్ణి అడిగింది.

విదూషకుడు పెదవి విరిచి, ''నిజానికి మీ ముఖంలోవున్న కళ, కాగడావేసి వెతికినా ఆమె ముఖంలో కనిపించదు. మీది సహజ సౌందర్యం; ఆమెది అలంకరణ తెచ్చిపెట్టిన సౌందర్యం! అయితే, ఈమధ్య మీరు వంటగదిలో ఎక్కువ కాలం గడుపుతున్నట్టున్నారు. అలవాటులేని పనికదా! పొగవల్ల ముఖంలో కాంతి తగ్గి, కళ్ళు ఎర్రబడినట్టు కనబడుతున్నారు,'' అన్నాడు.

ఇది వింటూనే రాణీ ముఖం చిన్నబోయింది. సొంతంగా వంట ఆరంభించాక, తన అందం తరిగినందుకు, ఆమె మనస్సు చివుక్కుమన్నధి. రాణీ ముఖభావాలు నిశితంగా గమనిస్తున్న విదూషకుడు, ''మహారాణీ! అయితే, చక్రవర్తి భార్యలోవున్న ఒక ప్రత్యేకత గురించి చెప్పకోక తప్పదు!'' అన్నాడు.

''ఏమిటా ప్రత్యేకత?'' అన్నది రాణీ ఎంతో గంభీరంగా.

''వేడుకల్లో చక్రవర్తి దంపతులు నలుగురితో కలిసి సహపంక్తి భోజనం చేశారు. ఆ సమయంలో చక్రవర్తి భార్య, అక్కడవున్న ఇరవై నాలుగు వంటకాలలో, భర్తకు నచ్చినవి ఏరి, తానే స్వయంగా వడ్డన చేసింది.ఆమె అలా వడ్డిస్తూంటే, తన మనసును గ్రహించిన ఆమెను ఎంతగానో మెచ్చుకుంటూ చక్రవర్తి విందారగించడం,కన్నుల పండువైన దృశ్యం! అక్కడ నేను విన్నదేమంటే —అంతఃపుర స్త్రీలు వంట జోలికి పోరట; భర్తలకూ, ఆత్మ బంధువులకూ వడ్డన మాత్రమే చేస్తారట!'' అన్నాడు విదూషకుడు.

ఆ రోజునుంచీ రాణీ స్వయంగా వంట చేయడంమాని, వంటవాళ్ళు చేసిన వంటకాలను, తానే రాజుగారికి వడ్డించడం ఆరంభించింది. రాజుగారి కష్టాలు తీరిపోయాయి. తిరిగి వచ్చిన మంచి రోజులకు గుర్తుగా, ఆయన మెడలోని ముత్యాలహారం ఒకటి, విదూషకుడి మెడను అలంకరించింది.



ఇదొక చందమామ కానుక!

4

# అజేయుడు గరుడుడు!

చిత్రాలు:పాణి

ప్రధానమంత్రి కుమారుడు ఆదిత్యుడు బందిపోటు దొంగలను ఉపాయంతో పట్టి బంధించాడు. అరుణ ఆదిత్యుణ్ణి కలుసుకుని- ప్రధానమంత్రీ, తన తండ్రీ ఒకేరోజు మరణించారని తెలియజేసి, అతనికి ఒక పేటికను ఇచ్చింది. అందులో ప్రధానమంత్రి స్వహస్తాలతో రాసిన ఒక గ్రంథం కనిపించింది. తల్లి దాస్యం పోగొట్టిన గరుడుడి కథ ఆ గ్రంథం వివరించబడింది.













సేనాధిపతికి నేనంటే ఇష్టం లేదని స్పష్టంగా తెలుస్తోంది!


"అవమానం! అవమానం! వాళ్ళందరినీ విడిచి పెట్టండి. రవీంద్రుణ్ణి ఎలాగైనా కాపాడుకోవాలి!"
"చిత్తం, మహాప్రభూ!"


బందిపోట్లందరూ విడుదల చేయబడ్డారు.


రవీంద్రదేవుణ్ణి వెంటబెట్టుకురావడానికి ఆదిత్యుడు గరుడాద్రికి బయలుదేరాడు.


అడవి చేరాక ఏదో ఒక నిగూఢ కంఠస్వరం అతన్ని ఒక గుహ సమీపంలోకి తీసుకువెళ్ళింది.


గుహద్వారంవద్ద ఒక మనిషి ముఖానికి ముసుగుతో, పెడరెక్కలు విరిచి కట్టబడి, గుర్రం మీద కనిపించాడు.



ఆదిత్యుడు ఆ మనిషి ముసుగు తొలగించాడు. అతనికి నవ్వాగలేదు.




అవమానం పాలైనప్పటికీ, రవీంద్ర దేవుడు దానిని కప్పిపుచ్చుకోవడానికి ప్రయత్నించాడు.




"తృటిలో తప్పించుకు పారిపోయారు దుర్మార్గులు! ఇంతలో నువ్వు వచ్చావు. వాళ్ళ అంతం చూసేవాణ్ణి!"




అడవిలో పిండారబోసినట్టు వెన్నెల కాస్తోంది. మారువేషంతో వీరుడొకడు కాపలా కాస్తున్నాడు.




...అదే సమయంలో విడుదల చేయబడిన బందిపోట్లు గుహలోపల తమలో తాము మాట్లాడుకోసాగారు.
"ఎవరీ గరుడుడు?"
"అతడెందుకు మనల్ని విడిపించాడు?"




వీరబాహు గుహ వెలుపలికి వచ్చి, మారు వేషంతో కాపలా ఉన్న వీరుణ్ణి సమీపించాడు.
"మేము విడుదలయ్యాము. మీ మేలు మరిచిపోము. అయినా, నువ్వెవరివో మాకు తెలియడంలేదు!"
"నువ్వు ప్రధానమంత్రి అంగరక్షకుడిగా ఉండేవాడివి కదూ?"




"మీరు చేస్తున్నవన్నీ చట్ట విరుద్ధమైన కృత్యాలని మీకు తెలియదా?"


''నిజమే! నేను ప్రధాని అంగరక్షకుడిగా ఉన్నవాణ్ణే! సేనాధిపతి చేసిన ఘోరకృత్యాన్ని కళ్ళారా చూశాను. కాని నేను అక్కడి నుంచి తప్పించుకోవలసి వచ్చింది. లేకుంటే, నన్నూ చంపి ఉండేవాడు.''


''అలాగా! అసలు ఏం జరిగిందో చెప్పు!''
''రవీంద్రుడు ప్రజలను దోచుకుంటున్నాడు. ప్రజలబాధలకు అంతం లేకుండాపోతున్నది... అందుకే మేము ఎదురు దాడికి దిగాము.''
''ప్రధానమంత్రిని హత్య చేసింది సేనాధిపతే అని, నువ్వెలా చెప్ప గలుగుతున్నావు?''


''సేనాధిపతి దుర్బుద్ధితో దొంగచాటుగా రాజ మందిరంలో ప్రవేశించాడు. ఆయన రాజును సమీపించేలోగా ఏవో మాటలు వినిపించడంతో గోడ చాటున దాక్కుని వాళ్ళ మాటలు విన్నాడు.''


''ప్రభూ! ప్రజలలో అశాంతి ప్రబలుతున్నది. రోజురోజుకూ పెరిగిపోతూన్న రవీంద్రుడి దురాగతాలను భరించలేకుండా ఉన్నారు.''


''ఆ మాట విన్న సేనాధిపతి, ప్రధానమంత్రి అడ్డును తొలగించాలను కున్నాడు.''


''ఆ తరవాతే రాజు ఆదిత్యుణ్ణి రప్పించాడు. మా పథకాలకు అతడు అడ్డు తగిలాడు. అయితే, అతడు అమాయకుడు. ఇక సెలవు, వెళతాను.''
''వీరబాహూ!''
తన పేరు వినబడగానే వీరబాహు చటుక్కున వెనక్కుతిరిగి, చిన్నగా నవ్వుతూన్న ముఖంకేసి చూశాడు.
—(ఇంకావుంది)

# వార్తలు  విశేషాలు

## మనదేశం

### గుజరాత్‌లో దెబ్బతిన్న పర్యాటక రంగం

జనవరి 26వ తేదీ గుజరాత్‌లో సంభవించిన భయంకర భూకంపం విపరీతమైన నష్టాన్ని కలిగించిన విషయం అందరికీ తెలిసినదే. అది ఈ యేడు పర్యాటకరంగాన్ని కూడా దారుణంగాదెబ్బతీసింది. యేటా వేలాది మంది గుజరాతీయులు వేసవి సెలవులను ఫ్రాన్స్, అమెరికా మొదలైన దేశాలలో గడపడం అలవాటు. ఈ యేడు వాటిల్లిన కచ్ భూకంపం కారణంగా విదేశాలకు వెళ్ళేవారి సంఖ్య బాగా తగ్గిపోవచ్చునని భావిస్తున్నారు. బుకింగ్స్ దాదాపు 40 శాతం వరకు పడిపోవచ్చునని ట్రావెల్ ఏజెంట్లు అభిప్రాయపడుతున్నారు. వేసవి సెలవులను విదేశాలలో గడపాలని పథకం వేసుకున్న చాలా కుటుంబాలు భూకంపం వల్ల తీవ్రంగా దెబ్బతిన్నాయి.

### కేంద్ర బడ్జెట్: రాయితీలు-వడ్డింపులు

విదేశాలలో ఉన్నత సాంకేతిక విద్య నభ్యసించాలనుకునే యువతీ యువకులకు భారత ప్రభుత్వం ఒక శుభవార్తను ప్రకటించింది. ఉన్నత సాంకేతిక విద్యనభ్యసించడానికి విదేశాలకు వెళ్ళాలనుకునేవారు 15లక్షల రూపాయల వరకూ, స్వదేశంలో అయితే 7.5 లక్షల వరకూ బ్యాంకుల నుంచి రుణంగా పొందవచ్చు.

కేంద్ర ఆర్థిక మంత్రి యశ్వంత్ సిన్హా ఫిబ్రవరి 28వ తేదీ పార్లమెంటులోసమర్పించిన 2001-2002 బడ్జెట్‌లో ఈ విషయం ప్రకటించాడు.

ఈ బడ్జెట్ తరవాత చక్కెర ధర పెరిగింది. చాక్లెట్లు, బిస్కట్లు మొదలైన తీపి తినుబండారాల మీద దీని ప్రభావం ఉంటుంది. అదే సమయంలో దీనిని భర్తీ చేయడానికి శీతల పానీయాల ధర తగ్గించడం యువతీయువకులకు సంతోషం కలిగించే విషయం. పిల్లలకు సంతోషం కలిగించేమరొక అంశం ఆటబొమ్మల, పాదరక్షల ధరలు తగ్గించడం.



కలం స్నేహం చేసేవారికీ, పోస్టుద్వారా పుస్తకాలూ, పత్రికలూ తెప్పించుకునేవారికీ, కరస్పాండెన్స్ కోర్సు చేసేవారికీ కష్టం కలిగించే సంగతి పోస్టేజీ పెంచడం. కాంపిటీషన్ పోస్టు కార్డు ధర నాలుగు రూపాయల నుంచి ఐదు రూపాయలకు పెరిగింది! ద్విచక్ర వాహనాల ధరలు కొద్దిగా తగ్గాయి. ఇది కూడా యువతరానికి ఉత్సాహం కలిగించే విషయమే మరి!

### ప్రవర్తనపై ప్రభావం చూపే శబ్దం!

ఏకాగ్ర చిత్తంతో చదవడంలో, చదివిన వాటిని జ్ఞాపకం ఉంచుకోవడంలో మీకేమైనా సమస్యలున్నాయా? అలాంటప్పుడు ఒకసారి మీ పరిసరాలను పరిశీలించి చూడండి. ప్రపంచ ఆరోగ్య సంస్థ ఇటీవల జరిపిన ఒకసర్వేలో-అధిక శబ్దానికి ఎక్కువసేపు గురయినట్టయితే రక్తపుపోటు, గుండెజబ్బులు వచ్చి ప్రవర్తనపై దుష్ప్రభావం చూపుతుందని తెలియవచ్చింది.



80 డెసిబెల్స్ కన్నా అధికంగా ఉన్న శబ్దం మనిషిలో అరాచక ప్రవర్తనను పెంచుతుందని ప్రపంచ ఆరోగ్య సంస్థ పేర్కొన్నది. కొందరిలో అది తాత్కాలికంగానో, శాశ్వతంగానో వినికిడిశక్తిని కోల్పోవడానికి దోహదం చేస్తుంది!

పెద్దవారి కలలు



పిల్లలు సామర్థ్యం

# యుటిఐ వారి పథకం

## చిల్డ్రన్స్ కెరియర్ ప్లాన్

- ఇదొక ఓపెన్-ఎండ్ పథకమై ప్రయోజనాలు అందుకోబోయే బిడ్డలపై గురిచూపి వారి కోసం స్కాలర్‌షిప్స్ రూపేణా లేదా వారు మేజర్ అయిన తర్వాత ఏదైనా వృత్తి, ప్రాక్టీస్/బిజినెస్ సెట్అప్ చేసుకోడానికి మద్దతు లభిస్తుంది.
- ఇది దేశవాసులు మరియు ప్రవాస భారతీయులు, దేశీయ సంస్థలు మరియు ఓసిబిలకు 15 ఏళ్ళ వయస్సులోపు బిడ్డల కోసం, అదీ బిడ్డలు దేశంలో నివసిస్తున్నా లేదా ప్రవాస భారతీయులైనా వారికోసం వర్తిస్తుంది.
- స్కాలర్‌షిప్ ఎంపిక- బెనిఫిసియరీ 18 ఏళ్ళ వయస్సు చేరిన పిమ్మట స్కాలర్‌షిప్ రూపంలో క్రమంగా చెల్లించబడుతుంది. ప్రస్తుత పన్ను చట్టాలననుసరించి స్కాలర్‌షిప్ పేమెంట్‌లపై పన్ను లేదు.
- గ్రోత్ ఆప్షన్- బెనిఫిసియరీ 18 ఏళ్ళు నిండిన పిదప పూర్తిగా లేదా పాక్షికంగా రీపర్చేస్ చేసుకోవచ్చు.
- కనీస పెట్టుబడి రూ. 2000/- ఆటు తర్వాత కనీసం రూ. 1000/- గుణికాలలో పెట్టుబడి పెట్టుకోవచ్చు.
- యూనిట్ యొక్క ముఖ విలువ రూ. 10/-.
- యూనిట్ల అమ్మకం ధర 103% ఎన్.ఎ.వి. పైన తిరిగి కొనుగోలు 18 ఏళ్ళ వయస్సు నిండిన పిదప అనాటి ఎన్ఎవి మీద ఆధారపడి వుంటుంది.

మరింత సమాచారం కోసం మీకు దగ్గర్లోనున్న యుటిఐ బ్రాంచి, యుటిఐ ఫైనాన్సియల్ సెంటర్స్, చీఫ్ రిప్రజెంటేటివ్ లేదా ఏజెంట్స్‌లను సంప్రదించండి.




## యూనిట్ ట్రస్ట్ ఆఫ్ ఇండియా

ఇండియాలో అతిపెద్ద మ్యూచువల్ ఫండ్

13, సర్ విఠల్‌దాస్ థాకర్సీ మార్గ్, న్యూ మరిన్ లైన్స్, ముంబాయి-400 020.
ఫోన్: 2031818, 2092998. మమల్ని సందర్శించండి: www.unittrustofindia.com

**రాజ్యాంగం** : యూటిఐ పని చేస్తోంది యూటిఐ చట్టం, 1963 ఏర్పాట్ల క్రింద. **నష్టాంశాలు** : మ్యూచ్యువల్ ఫండ్లలోనూ, సెక్యూరిటీలలోనూ పెట్టే పెట్టుబడులన్నీ మార్కెట్ రిస్క్‌లకి నిబద్ధంగా వుంటాయి, యిక పథకాల యొక్క ఎన్ఎవి, సెక్యూరిటీ మార్కెట్‌ని ప్రభావితం చేసే అంశాలూ, శక్తులపై ఆధారపడుతూ వాటిలో హెచ్చుతగ్గులుంటాయి. గతంలోని కార్యసాఫల్యం, భవిష్యత్తులోని ఫలితాలకి సూచన కానక్కరలేదు. చిల్డ్రన్స్ కెరియర్ ప్లాన్ కేవలం యీ పథకం యొక్క పేర్లు మాత్రమే, యిది ఏ విధంగానైనా సరే యీ పథకపు లక్షణాన్నిగాని, భవిష్యత్తులోని అవకాశాలనుగాని, చేకూరగల లాభాలకుగాని సూచన కాదు. ఈ పథకం యొక్క ధ్యేయాలు సాధించబడతాయనే హామీ యివ్వబడటంలేదు. పెట్టుబడి పెట్టే ముందుగా ఆఫర్ డాక్యుమెంట్‌ని చదవమని మనవి.

**దక్షిణ మండలం ఆఫీస్** : చెన్నై, ఫోన్ : (044) 5210347. **బ్రాంచి ఆఫీసులు** : హైదరాబాద్, ఫోన్ : 4611095 • విజయవాడ, ఫోన్ : 571134 • విశాఖపట్టణం, ఫోన్ : 548121. **ఫ్రాంఛైజీ ఆఫీసులు** : ఏలూరు, ఫోన్ : 34703 • గుంటూరు, ఫోన్: 231839 • రాజమండ్రి, ఫోన్ : 444830. **సి ఆర్ కలెక్షన్ సెంటర్లు** : అదిలాబాద్, ఫోన్ : 62412 • అనంతపుర్, ఫోన్ : 20196 • కడప, ఫోన్ : 44701 • కరీంనగర్, ఫోన్ : 66312 • ఖమ్మం, ఫోన్ : 28711 • కర్నూల్, ఫోన్ : 21413 • మెదక్, ఫోన్ : 22846 • నెల్లూరు, ఫోన్ : 331500 • నిజామాబాద్, ఫోన్ : 38016 • రంగారెడ్డి, ఫోన్ : 4060408 • సూర్యాపేట, ఫోన్ : 20545 • తిరుపతి, ఫోన్ : 25176 • విజయనగరం, ఫోన్ : 25461 • వరంగల్ ఫోన్ : 79567. **యుటిఐ బ్యాంక్** : బేగంపేట్ రోడ్, ఫోన్ : 3410383 • జూబిలీ హిల్స్, ఫోన్ : 3600082-84 • తారనాకా, ఫోన్ : 7004458.

ఎయిడ్స్ నివారించండి - అందరినీ ప్రేమించండి

058/4-2001C TEL



# ఇద్దరిలో మేటి

మగధరాజుకు ఇద్దరు భార్యలు. ఆ ఇద్దరూ ఒకే రోజున, ఒకే క్షణాన అందమైన చెరొక మగ బిడ్డనూ కన్నారు. ఒక బిడ్డకు అమరసింహు డనీ, రెండోవాడికి జయసింహుడనీ పేర్లు పెట్టారు.

ఇద్దరు బిడ్డలూ రూపంలోనూ, సౌష్టవం లోనూ ఒకరి కొకరు తీసిపోకుండా పెరు గుతూ వచ్చి, అన్ని విద్యలలోనూ సరిసమా నులనుపించుకున్నారు.

యుద్ధ విద్యలలో కూడా వారిలో ఎవరు ఎవరికి తీసిపోయేదీ నిర్ణయించటం సాధ్యం కాలేదు. అయితే, క్రమ క్రమంగా వారిద్దరి లోనూ ఒకతేడా స్పష్టంగా కనిపించసాగింది. అమర సింహుడు గుర్రపుస్వారీలోనూ,కత్తి యుద్ధంలోనూ మిన్న. జయసింహుడు ఏనుగు స్వారీలోనూ, మల్లయుద్ధంలోనూ సాటిలేనివాడు.

ఇద్దరు రాజకుమారులూ ఎంతో అన్యో న్యంగా ఉండేవారు.

రాజుకు వార్ధక్యం వచ్చింది. తన తరవాత తన కొడుకులలో ఎవరు సింహాసనం మీద కూర్చోవాలన్న సమస్య రాజును బాధించ సాగింది. ఇద్దరు పిల్లలూ ఒకేరోజు పుట్టారు; ఒకరికొకరు పెద్దా, చిన్నా అన్న సమస్యలేదు. రాజ్యం రెండుగా చీల్చే సమస్య కూడా లేదు. అందుచేత వారిద్దరి యోగ్యతలలోనూ ఏదైనా వ్యత్యాసం కనిపెట్టి, హెచ్చు యోగ్యత గల వాడికి పట్టం కట్టాలి. రాజూ, మంత్రీ ఎంతో కాలం నెమ్మదిగా చర్చించి ఇలాంటి నిర్ణ యానికి వచ్చారు. కాని ఇద్దరు రాజకుమా రుల యోగ్యతలలో ఎవరిది ఎక్కువన్నది నిర్ణయించటం ఎంత ఆలోచించినా వారికి సాధ్యం కాలేదు. ఇద్దరిలో మేటిని తేల్చగల మార్గం ఏదా అని ఎదురు చూడసాగారు.

రాజూ, మంత్రీ తమలో ఎవరికి సింహా సనం ఇవ్వాలన్న దాన్ని గురించి ఇంతగా ఆలోచిస్తున్నట్టు రాజకుమారులకుఏమాత్రం తెలియదు.

**25- ఏళ్ళనాటి చందమామ కథ**



ఇలా వుండగా కౌశికదేశపు రాజకుమారికి స్వయంవరం ప్రకటించారు. ఆ సందర్భంలో క్షత్రియోచిత వివిధ యుద్ధవిద్యలలో పోటీలు పెట్టి, వాటిలో ఉత్తమంగా నెగ్గిన వారికి రాజకుమార్తెను ఇచ్చి వివాహం చేసేటట్టు నిర్ణయించబడింది.

ఈ సంగతి విని రాజూ, మంత్రీ కూడా రాజకుమారులను స్వయంవరానికి పంప నిర్ణయించారు. అక్కడే వారి శక్తి సామర్థ్యాలలో ఉన్న తేడా బయటపడుతుందని వారి నమ్మకం. తండ్రి కోరిన మీదట అమర సింహుడూ, జయసింహుడూ కౌశిక రాజ కుమార్తె స్వయంవరానికి వెళ్ళారు.

స్వయంవరానికి అనేకమంది రాజకుమారులువచ్చారు. అమరసింహ, జయసింహులు విడివిడిగావారితో పోటీచేసి, అందరినీ ఓడించి, సమంగా విజయాలు సాధించారు. వారిద్దరి మధ్యా పోటీ జరిగినప్పుడు కత్తియుద్ధం లోనూ, గుర్రపుస్వారీలోనూ అమరసింహుడిది పైచెయ్యి అయింది. మల్లయుద్ధం లోనూ,ఏనుగు స్వారీలోనూ జయసింహుడిది పైచెయ్యి అయింది. ఆ విధంగాకూడా వారిద్దరి విజయాల సంఖ్య ఒకటే అయింది.

కౌశికరాజు వారిద్దరి మధ్యా ఎవరికి తన కుమార్తెనిచ్చి చెయ్యాలో తేల్చుకోలేక, తన నిర్ణయాన్ని ప్రకటించటానికి మూడు రోజులు గడువు పెట్టి, అందరినీ బసలకు పంపేశాడు. తరవాత ఆయన తన మంత్రులతో ఆలోచించి ఒక చాటింపు వేశాడు. ఆ చాటింపు ఏమిటంటే, అమరసింహ, జయసింహులలో ఎవరు గొప్పో తెలిపిన యోగ్యుడైన యువకుడికి తన అర్ధ రాజ్యం ఇచ్చి, తన రెండవ కుమార్తెనిచ్చి పెళ్ళి చేస్తానని. చాటింపు జరిగిన మర్నాడు రాజ సభకు ఒక ముని, తన శిష్యుణ్ణి వెంట

బెట్టుకు వచ్చి, "రాజా, మీ కుమార్తె స్వయం వరంలో ఏర్పడిన సమస్యను నా శిష్యుడు పరి ష్కరిస్తాడు," అని చెప్పాడు.

ముని మాటలు వినగానే సభలో ఒక్క నిమిషం కలకలం బయలుదేరింది, ఆ తరవాత ఎక్కడ చూసినా నిశ్శబ్దం. ముని శిష్యుడు ఆ సమస్యను ఎలా పరిష్కరిస్తాడా అని సభికులు ఉత్కంఠతతో ఎదురు చూడ సాగారు.

రాజు చాలా సంతోషపడి, "ఏమిటా పరిష్కారం?" అని అడిగాడు.

అప్పుడు మునిశిష్యుడు రాజుతో ఇలా అన్నాడు:

"రాజా, అమరసింహ, జయసింహులలో అమరసింహుడే మిన్న. అందులో సందేహం లేదు. అమరసింహుడు జయసింహుడి కన్న కత్తి యుద్ధంలోనూ, గుర్రపు స్వారీలోనూ మించగలడు; ఏనుగుస్వారీలోనూ, మల్ల యుద్ధంలోనూ తక్కువే. కాని ఏనుగుపైనున్న ఖడ్గంలేని వీరుడికన్న, గుర్రంపైనున్న ఖడ్గ వీరుడు గొప్ప వీరుడు కాడా? అదీగాక గుర్రం ఏనుగు మీదుగా దూకిపోగలదు. ఏనుగు గుర్రం మీదుగా దూకలేదు. ఏనుగు పైనుండే మల్లుడు, గుర్రం మీద ఉండి కత్తిపట్టినవాణ్ణి ఏ పరిస్థితిలోనూ చంపలేడు. కాని ఏనుగు మీద ఉన్న మల్లుణ్ణి కత్తిపట్టిన అశ్వికుడు తేలికగా చంపగలడు. ఈ కారణాల వల్ల జయసింహుడి కన్న అమరసింహుడే మిన్న."

ఈ వాదాన్ని సభలో అందరూ ఆమోదిం చారు. రాజు కూడా తన సమస్య పరిష్కారమై నట్టు తృప్తిపడ్డాడు.

వెంటనే మునీ, ఆయన శిష్యుడూ తాము ధరించిన వేషాలు విప్పి, అసలు రూపాలతో ప్రత్యక్షమయ్యారు.

ముని అమరసింహుడే; అతని శిష్యుడు జయసింహుడు.

కౌశికరాజు తన కుమార్తెల నిద్దరినీ అన్న దమ్ములకిచ్చి పెళ్ళి చేసి, జయసింహుడికి అర్ధరాజ్యం ఇచ్చేశాడు.

మగధరాజు సమస్యకూడా తీరిపోయింది. కనక, ఆయన అమరసింహుడికి పట్టాభిషేకం చేసేశాడు.






# ఫోటో వ్యాఖ్యల పోటీ





ఈ ఫోటోలకు ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలో గాని వ్యాఖ్యలు రాయగలరా? రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.

వ్యాఖ్యలను కాంపిటీషన్ పోస్ట్‌కార్డుపైన రాసి ఈ నెల 25వతేదీలోగా మాకు అందేలా పంపాలి.పోటీ ఫలితాలు జూలై 2001 సంచికలో ప్రచురిస్తాం. ఉత్తమమైన వ్యాఖ్యకు రూ. 100 బహుమానం.

ఫోటో వ్యాఖ్యల పోటీ: చందమామ, 82,డిఫెన్స్ ఆఫీసర్స్ కాలనీ,
ఈకాట్టుతాంగల్, చెన్నయ్ - 600 097.

## అభినందనలు

మార్చ్ 2001 సంచికలో బహుమతి
పొందిన వ్యాఖ్యలు పంపినవారు:
ఎ.సుధాకర్
జి/డి - 250, గంగా కాలనీ,రామకృష్ణాపూర్ పోస్ట్
ఆదిలాబాద్ జిల్లా - 504 301. ఆం.ప్ర

బహుమతి పొందిన వ్యాఖ్యలు





మొదటి ఫోటో: గారాల పట్టి!
రెండవ ఫోటో: యోగాలో జెట్టి!!







# స్కూల్ మొత్తాన్ని, బొటనవేలితో ఆడించండి!!

భయపెట్టే ఫింగర్ ప్రాంకీస్!









ఈ ఆఫర్ 32 గ్లాస్ రస్నా సాఫ్ట్ డ్రింక్ కాంసన్‌ట్రేట్ ప్యాక్ మీద వర్తిస్తుంది. స్టాకులున్నంత వరకే ఈ ఆఫర్ వర్తిస్తుంది. ఈ ఆఫర్ లేకుండా కూడా ప్యాక్‌లు లభిస్తాయి.

For more Pranky fun visit: www.gogokid.com

Mudra:RASNA:366/CHN/Tel.



# రస్నా ఉచిత భూతం ఆఫర్!



వేలాది ప్యాక్‌లు ఒక చిన్న భూతాన్ని
మరియు ఒక ఉత్తరాన్ని కలిగి ఉంటాయి.

ఆ ఉత్తరాన్ని తిరిగి పోస్ట్‌లో పంపి, పొందండి,
మెరిసే పెద్ద భూతం, ఉచితంగా!




ఈ ఆఫర్ 32 గ్లాస్ రస్నా
సాఫ్ట్ డ్రింక్ కాంసన్‌ట్రేట్
ప్యాక్ మీద వర్తిస్తుంది.
స్టాకులున్నంత వరకే ఈ
ఆఫర్ వర్తిస్తుంది.
ఈ ఆఫర్ లేకుండా కూడా
ప్యాక్‌లు లభిస్తాయి.






For more Pranky fun visit: www.gogokid.com

Mudra:RASNA:367/CHN/Tel.